గోద్రెజ్ నుంచి కొత్తది

# మహత్తర శక్తిగలది

# కీ

నీలిరంగు డిటర్జెంట్
ఉతికే పౌడర్—
అమోఘ చర్యతో
కాంతివంతం చేసేది

**పవిత్రమైన ఋజువు**

మహత్తరమైన శక్తి గల కొత్త 'కీ' బట్టలను మరింత తెల్లగా, కాంతివంతంగా ఉతుకుతుందని లేబొరేటరీలో చేసిన పరీక్షలు నిరూపించాయి. ఎందుకంటే, కీలోని శక్తి లోనికి చొచ్చుకు పోయి బట్టలలోని ఎంత'కీ'వదలని మురికిని వదలిస్తుంది గనక. దీనిలో మహత్తర చర్యతో కాంతివంతం చేసే ప్రత్యేకమైన పదార్థం ఉందిమరి.

**తాజాగా, హాయినిచ్చే పరిమళం**

మీ యింట్లోని బట్టలన్నింటినీ ఉతికేందుకు హాయిగా, పరిమళం చిందించే 'కీ' వాడండి. 'కీ' వేణ్ణీళ్ళలో, చన్నీళ్ళలో కూడా యిట్టే కరుగుతుంది—సమృద్ధిగా నురుగునిస్తుంది—ఉప్పు నీళ్ళలో కూడా.

**మీ బట్టలకు సురక్షితమైనది—**
**మీ చేతులపై సున్నితమైనది**

సమృద్ధియైన 'కీ' నురుగువల్ల మీ ఉతికే పని మరింత సులభం. మీ చేతులపై సున్నితంగా ఉండేది. మీ బట్టలను ఏ మాత్రం దాగుల్లేకుండా శుభ్రంగా, ప్రతి ఉతుకుతో, మరింత తెల్లగా కాంతివంతంగా చేస్తుంది.

*50 గ్రా., 200 గ్రా.ల కార్టన్లలో, 500 గ్రా., 1 కె.జి. పోలిప్యాక్ లలో దొరుకుతుంది.*




## గోద్రెజ్
ఉత్పాదన

CHAITRA-G-59 TEL

# నవ్వండి!

## కొనీ మోపెడ్ యజమానికి స్వంత సాధనం వుండనే వుంది!

ఆసీటు మీకు లభ్యమయ్యేందుకు ఎంత శ్రమపడవలసివుందో ఆలోచించండి!

ప్రొద్దున ఇంటినుంచి పెందరాళే బయలుదేరాలి. బస్సు స్టాపు క్యూలో పోరాడాలి. ఆ తర్వాత సీటుకై యమయాతనపడాలి. ఒకవేళ మధ్య దోవలో బస్సు నిలిచేపోయిందనుకోండి, మరి మీ మిగతా ప్రయాణం స్తంభించిపోగలదు. మహా దుర్భరమైన సందర్భంగదా.

మరైతే, మీరు ఒక మోపెడ్ స్వంతదారైవుంటే! ఇది మీకు సంభవించివుండదు. పైగా మీరు ఎట్టివేళలోనైనా, ఏ ప్రదేశానికైనా తలచుకున్నప్పుడు వెళ్లటకు మీ స్వంత సాధనం సర్వసన్నద్ధంగా వుండగలదు!

**(మీకు వున్నదల్లా బస్సులో ఒక సీటు మాత్రమే)**

మరి మయూరాన్ని పరిశీలించండి. రోడ్డు పట్టుకు, ఉచితమైన బ్యాలెన్సును నిలుపుటకు, వాహనపు బరువు యావత్తూ వైజ్ఞానిక నైపుణ్యంతో వాహనం మొత్తం మీద సమతలంగా సర్దుబాటు చేయబడింది. వాహనానికి కుదుపుల మూలంగాను, ప్రయాణంవల్లను కలిగే అలసటను నివారించుటకై టెలిస్కోపిక్ ఫోర్క్ ఫ్రంటు అమర్చబడింది. హఠాత్పరిణామాలను చక్కగా నిభాయించుకోగల ట్యూబ్యులర్ ఫ్రేము. సుఖంగా పయనించుటకు అనువైన హేండిల్ బార్లు. స్వల్ప వ్యయంలో అధికమైలేజి నిచ్చుటకు శ్రేష్ఠమైన కార్బ్యురేటర్.

మీరు మయూరంను పొందివుంటే, దానిపై పయనించుట ఎంత హాయో మీకే అవగాహనకాగలదు.

బస్సులుకాని, ఆటోలుకాని, టాక్సీలుకాని ఏవీ అవసరంలేదు. మీ స్వంత మోపెడ్. మయూరం. మీకు చేయూత నీయగలదు.

ఇంతా తెలిసికూడా మీరు మోపెడ్ స్వంతదారును చూచి నవ్వుతూనే వుండగలరా?

ఆయన కూడా ఒకప్పుడు మీలాగే నవ్వుతూండేవారు. ఇప్పుడో, తమ క్రితంకన్న ఇప్పుడు చాతుర్యమైన వారని నమ్ముతున్నారు.



ఇప్పుడు మయూరం తేలిక వాయిదా పద్ధతులలో లభ్యమౌతోంది. వివరాలకు మీ సమీపంలోగల ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్ శాఖతో గాని, క్రింద సూచించిన తమిళనాడు మోపెడ్స్ లిమిటెడ్ వారి విలాసంతో గాని సంప్రతించండి.



## మయూరం

**- మీరు సిద్ధంగా వున్నప్పుడు పొందగలిగే ఒకే ఒక మోపెడ్**

## తమిళనాడు మోపెడ్స్ లిమిటెడ్

(తమిళనాడు స్మాల్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్ లిమిటెడ్‌వారి ఒక ఉప సంస్థ)
ఇండస్ట్రియల్ ఎస్టేట్, గిండీ, మద్రాసు 600 032.

FDS TML 3644A TEL

# ఉత్తరాలు

## అట్టమీద బొమ్మ

మీ (మా) అభిమానపత్రిక ముఖచిత్రం జయలక్ష్మి బాగులేదని చెప్పుటకు చింతిస్తున్నాము, సీరియల్ రాగమాలిక బాగుంది. వేస్టు జోకర్ రచయిత యైన గుడిసేవ సుందరరామయ్యగారు ఎంతైనా అభినందీయులు. వారు ఈ కథను వాస్తవానికి దగ్గరగా మలిచినందుకు, ప్రచురించిన మీకు అభినందనములు, ముఖ చిత్రాలు నటులవి కూడా వేయండి.

హెచ్. మురళీధర్, రమాకాంత్, (విశాఖ)

*　　*　　*

3—2—78 న పతివ్రతా శిరోమణి, కుమారి జయలక్ష్మి ముఖ చిత్రముతో వెలువడిన, ముఖచిత్రములాంటివి ఇకముందు కూడా వేసి, అనంతకాంతి వెలుగులతో, దాదాపు దేదీప్యమానముగా, దినదినాభివృద్ధి చెందుతున్న మీ (మా) ఆంధ్ర సచిత్ర వార పత్రిక యొక్క విలువను తగ్గించరని ఆశించుచున్నాను.

బి. కె. అహ్మద్ [ఆముదాలవలస.]

## కార్టూన్లు

3—2—78 పత్రిక ముఖచిత్రం మమ్మల్ని అమితంగా ఆకర్షించింది. జయదేవ్‌గారి కార్టూన్స్ మమ్మల్ని నవ్విస్తు న్నాయి. రామలక్ష్మిగారి ప్రశ్నావళి సంతృప్తికరంగా ఉన్నది.

న్యాయపతి లక్ష్మి నరసింహదాస్, అల్లుమల్లు రామారావు. (కలకత్తా)

## సీరియల్

సీరియల్ రాగమాలిక నాకు చాలా బాగుంది. తాజా కాలమ్‌లో జె. సి. షా కవిపన్ పాఠకులకి అందించిన (మీ) మా పత్రికకు నా అభినందనములు, పెద్దింటి విజయలక్ష్మిగారు రచించిన ఋణం, కథ సస్పెంతో ఆకర్షించింది.

చిన్నారి వరప్రసాద్ [ఖర్గపూర్]

*　　*　　*

10—2—78 న ఆంధ్ర సచిత్రవారపత్రిక ముఖచిత్రం తాళ్ళూరి రామేశ్వరి— చంద్రమోహన్‌ల జంట చూడ ముచ్చటగా ఉంది. శ్రీమతి మాధవ పెద్ది పుణ్యశీలా ప్రసాద్‌గారు రచించిన సీరియల్ రాగమాలిక ఎంతో ఆసక్తిదాయకంగా ఇంటరెస్టుగా సాగుతున్నది. కథలలో వాణిశ్రీగారి చేపపిల్ల కథ చిన్నదయినా బాగానే యున్నది. హైదరాబాద్ నోట్‌బుక్ చదివి తెలియని విషయములు చాలా తెల్సుకొనుచున్నాము. టి. రామచంద్రరావుగార్కి మా అభినందనములు.

వేమూరి వేంకటేశ్వర శర్మ [సిధియా]

(50వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 24–2–'78
సింగరనామ సం. వాఘ బ. పాడ్యమి
సంపుటము 71 : సంచిక 23
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
*
పోస్ట్‌లో ఏడాది చందా రు. 41–60
ఆరు మాసాల చందా రు. 20–80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక





## లోకంపోకడ—ఊమెన్












# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**ఆ. నా. రా. ఖర్గపూరు**

ఫలించలేని మూగ ప్రేమపై మీ అభిప్రాయం ?

అసలే మూగ అంటున్నారు. పైగా ఫలించలేదంటున్నారు, ఇంక అలాంటి ప్రేమ గురించి మాట్లాడ్డం దండుగ. మరిచి పోడం మంచిది.

**బి. జి. కె. చీరాల**

స్త్రీ అభివృద్ధి జరుగాలంటే స్త్రీలలో చైతన్యం ముఖ్యంగాని పురుషులను ద్వేషించడం కాదంటాను.

నిజమే కాని స్త్రీలలో చైతన్యం రావాలంటే పురుషుల సహకారం కావాలి కద. సరైన దోహదం అందివ్వని పురుషులను అణగదొక్కబడిన స్త్రీలు ద్వేషించడంతో ఆశ్చర్యం లేదు. అందరినీ ఎందుకు ద్వేషిస్తారు. ? ఏ రాజా రామ్మోహన్‌ని హో కందుకూరిని ఆరాధ్య దైవాలుగా చేసుకోలేదా ఆడువారు ? !

**టి. ఏ ఆర్. ఎమ్. శ్రీకాకుళం**

మనిషికి శారీరక సౌందర్యంకంటే మానసిక సౌందర్యం ముఖ్యం కాదా ?

ముఖ్యమే. కాని అది కంటికి కనిపించదే కంటికి కన్పిస్తేంటేనే దిక్కులేదు, ఇక కనిపించని ఆత్మ సౌందర్యాన్ని గౌరవించమంటే సామాన్యులకి సాధ్యమయ్యేదా అని !

**ఎమ్. ఎస్. ఎన్. ఎమ్. శ్రీహరికోట**

వర్తమాన కాలంలో వరకట్న నిర్మూలన కొరకు రాక్షస వివాహములు ఉపయోగకరం అని నా ఉద్దేశ్యం. మీరేమంటారు.

ప్రేమ వివాహానికే చేవలేని యువకులు రాక్షస వివాహానికి ధైర్యం చేయలేరంటాను. ప్రేమించి పెళ్ళి చేసుకుంటూపోతే, అన్నిలాంటి వాటికీ బేరాలు పెడతారే, ఇక లేవలీసుకుపోయి పెళ్ళి చేసుకుని పెళ్ళాన్ని పోషిస్తారా అని ! అలా పెళ్ళాన్ని పోషించకల ధైర్యం వుంటే రాక్షస వివాహం అక్కరలేదు— పెద్దలని ఒప్పించి చేసుకోవచ్చు, ఎదిరించీ చెసుకోవచ్చు.

**ఉదవ్. కుర్దారోడ్**

అనువనాకం ముందు, తరువాత ఆడది పుట్టింది. కనుకనే మన అక్షరాలలో ఆ తరువాత ఆ వుందట.

అలాగా ? నేనే మనుకున్నానో తెలుసా ? అతను, తరువాత ఆమె వరుసన ఇలా వున్నాయని

తమ ప్రశ్నలకి జవాబులు దొరక్క మిమ్మల్ని అడుగుతున్నారు పాటకులు అనుకుంటున్నారా మీరు ?

నేనేం పిచ్చిదాన్నా అలా అనుకోడానికి !

**ప్రకాష్. టాటానగర్**

అగ్ని జ్వాలను నీటితో చల్లార్చవచ్చు కాని అక్కినేని దేవదాసులాంటి భగ్నప్రేమికుల ప్రేమ జ్వాలను చల్లార్చడం ఎలా ?

మళ్ళీ మళ్ళీ దేవదాసును తీయడం మూలంగా చల్లార్చ వచ్చునేమోనని ప్రయత్నాలు చేస్తున్నారు. కదా. వేచి చూద్దాం.

**జి. వి ఆర్. ఆర్. ఖర్గపూరు**

స్వార్థంకోసం ఇతరులపై నిందమోపి వాళ్ళను అన్యాయం చేసిన వాళ్ళను ఏమనాలి ?

అనుకున్నది సాధించిన వాళ్ళు అనాలి. దానికే నేర్పుండాలి.

**కె. సి. ఆర్. సహరన్‌పూర్**

గడుసు తనానికి గయ్యాళి తనానికి తేడా ఏమిటి ?

గడుసుతనంలో కొస్త జాణతనం వుంటుంది. గయ్యాళితనంలో చేతకాని ఛోళత్వం వుంటుంది. జీవితంలో అందరూ సుఖాలే కోరుకుంటారు. కష్టాలు కోరుకోరు కారణం ఏమిటి ?

పిలవక వచ్చే పేరంటాళ్ళ కష్టాలు. అవి కోరుకోనక్కరలేదు. పిలిచినా రాని గడుసరులు సుఖాలు పదే పదే కోరుకున్న కొద్దీ దూరం అయి మరీ మరీ కోరుకునేలా చేస్తాయి.

**విసాల్, బరంపురం**

కాటిలోకి వెళ్ళినా స్త్రీలను నమ్మరాదు అని పెద్దలు అంటారు.

అక్కడి కెళ్ళాక ఎవరూ ఎవర్నీ నమ్మక్కరలేదు. భూమ్మీ దున్నంత కాలం జీవితం సుఖంగా సాగాలంటే, నమ్మకం ఒక ముఖ్యమైన ప్రాతిపదికగా వుండాలి.

**జి. ఎస్. డి. పలుమనేరు**

ప్రేమ పక్షుల్లారి ప్రేమ ప్రేమ అంటారే అసలు ప్రేమ లేకపోతే మనిషి జీవించలేడా ?

ఎందుకు జీవించలేడు హాయిగా ఒంటిపిల్లి రాకాసిలాగా రోజు లెక్కపెట్టుకుంటూ రంగూ రుచీ వాసనా లేని జీవితం దొర్లించేస్తూ మహారాజులా బ్రతికేయవచ్చు సోదరీ !

**జి. ఆర్. కె. ఎస్. పైడిపెల్లి**

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. వరకట్నం తీసుకోక ఆమెను పెండ్లి చేసుకోవాలని నా కోరిక. మా ఇంట్లో ఒప్పుకోడంలేదు ఎలా ?

ప్రేమించడానికి ఒప్పుకున్నారా మీ ఇంట్లో ?! ప్రేమకి పర్మిషన్ అక్కరలేదు. పెళ్ళికి కావాలి. చూడండి, కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకొని ఉద్ధరిస్తున్నామనుకునే కంటే ఇంట్లో వాళ్ళు చెప్పినట్లు కాస్తో కూస్తో కక్కుర్తిపడి పెళ్ళి చెసుకోడం నయం మీలాంటి వాళ్ళు అలా కాకపోతే, పానం కట్టుకున్న దాన్ని బ్రతికి నన్నాళ్ళు దెప్పుతారు నేను కనక, కట్నం లేకుండా పెళ్ళాడానంటూ !

**బి. ఎల్. తిరుపతి**

మీరు సినిమాల్లో సూర్యకాంతంలాగా నటించ కూడదూ ?

ఎలా ? నిజజీవితంలోనే సినిమాలో సూర్యకాంతం లాగా వుండే వాళ్ళ ఇంకేం నటిస్తారు?

**డి. ఎమ్. ఆర్. నల్లగొండ**

వేశ్యలను పెళ్ళి చేసుకుంటే వాళ్ళ పాత కథలు మరిచిపోతారా ?

ఎవరు ? వాళ్ళా ? మీరా ?

**వై. ఎస్. ఆర్. జెంషెడ్‌పూరు**

అనురాగం—ఆత్మీయత, బాంధవ్యం, కృతజ్ఞత అన్నిటినీ వదులుకొని దూరంగా బ్రతికేటి మనిషిని ఏమని సంబోధించాలి ?

సన్యాసి రాజా !



**మరిడయ్య ఆశగా చూశాడు. అల్లంత దూరాన యిద్దరు మనుషులు గబగబా వస్తున్నారు.**

**ఒకఆడమనిషి ఒక మగమనిషి.**

వాళ్ళు గుండెలు అలిసిపోయేలాగ మైలు దూరంనుంచీ పరుగు పరుగున వస్తున్నారు.

ఆడమనిషి పచ్చ చీర గావును కట్టు కుంది. ఆకుపచ్చ చీర. ఆ మనిషి చేతుల్లో ఒక మగపిల్లాడు వున్నాడు.

మగమనిషి చిన్న పంచెగుడ్డ కచ్చాపోసి కట్టుకున్నాడు. తువ్వాలుగుడ్డ ముక్కో, చీరముక్కో తలపాగా చుట్టుకున్నాడు. కాదు బుర్రకు అడ్డదిడ్డంగా చుట్టేసుకున్నాడు. బుజంమీద ఒక పాత, చినుగుల పంచపాత, నల్లగా వున్నాడు. దిమిరి పొడుగు మనిషి లాగ పొడుగ్గా పల్చగా వున్నాడు. వాళ్లు గోర్జు దాటి మట్టిరోడ్డెక్కారు.

రోడ్డు చితుకు చితుకూ మంటున్నాది.

మూడురోజులాయి చినుకులు. కురవవు, మానవు. ఈ మూడు రోజుల్లూ, పొద్దే పొడవలేదు. కారునల్లని మబ్బులు మృత్యువు లాగ కమ్ముకొచ్చేస్తున్నాయి.

ఆడమనిషి, తన చేతుల్లో వున్న మగ పిల్లణ్ని— మగమనిషికిచ్చింది.

మగమనిషి చుట్టపారేసి రిక్షాలోంచి దిగాడు.

సందేహంలేదు పట్నం బేరమే. ఒక రూపాయి డబ్బులు దొరికాయన్నమాట.

మరిడయ్యకు పొద్దుణ్ణించీ డబ్బులబేరం రాలేదు.

బోణీబేరం పెద్దనాయుడిది. పట్నం తీసుకెళ్ళేడు. ఆ నాయుడు శ్రీరాజా టాకీస్ దగ్గిర దిగిపోయాడు. దిగిపోయి జేబులోంచి వో చుట్ట తీసి మరిడయ్య కిచ్చాడు. డబ్బి లన్నట్టు చూశాడు మరిడయ్య, బుర్ర గోక్కుంటూను.

''తీసుకుందూగాన్లే''అన్నాడునాయుడు. అని గబగబా వెళ్ళిపోయేడు.

''చిత్తం'' అన్నాడు మరిడయ్య. నాయుడు తప్పకుండా డబ్బులిచ్చేస్తారు. కాని యిప్పుడు కాదు మరి.

నిన్నటి డబ్బుల్లోవి పది పైసలు మిగి లాయి. టీ తాగుదాం అనుకున్నా మరో అయిదు పైసలు కావాలి. మరో రిక్షావాణ్ణి అగ్గిపెట్టడిగి చుట్ట ముట్టిం చాడు. చాలా సేపు చూశాడు: బేరంలేదు. పన్నెండు గంటల వేళప్పుడు టౌన్లోంచి ఊరి చివరనున్న మిల్లుకు చిన్నబియ్యం




మూట తీసుకొచ్చాడు. పావలా సంపాయిం చాడు. పావలా రిక్షా హేండిల్ బార్‌కి కొట్టి ముద్దు పెట్టుకుని బనీను జేబులో పడేసు కుని బయల్దేరాడు. తిన్నగా డౌన్లే, రావి చెట్టు జంక్షన్‌లో కొచ్చాడు. ఆ జంక్షన్‌లో మామూలు బస్సులన్నీ ఆగుతాయి. అక్కణ్ణించి రెండు మూడు ఊళ్ళకి మట్టి రోడ్లున్నాయి. రావిచెట్టుకిందటీకొట్టుంది, కాస్తంత దూరంలో మరోపాక వుంది. అది పెద్దనాయుడి గరుగులో వుంది. అంతకు తప్పించి ఆ చుట్టుపట్ల యిళ్ళు లేవు. ఆ జంక్షన్‌కు మరిడయ్యది ఒక్కటే రిక్షా. బస్సు దిగినవాళ్ళని ఆయా వూళ్ళకి తీసుకువెళుతుంటాడు. ఆయావూళ వాళ్ళని రెండుమైళ్ల దూరంలోవున్న బస్తీకితీసుకు వెళుతుంటాడు. బస్తీకి తీసుకుపోతేమనిషికి అర్ధరూపాయి. యిద్దరయితే రూపాయి. ఒకోరోజు నాలుగయిదు రూపాయిలదాకా సంపాయిస్తాడు. ఒకోరోజుఒట్టి పెట్టివట్టి బేరం వుండదు. చినుకులు పడుతున్న ఈ మూడురోజులనుంచీ 'యవ్వారం' ఇలాగే వుంది. ఇవాళ మరీ 'గోరం'.

కుర్రాడి బరువు గుండెలకెగబోడుస్తుం డగా ఇద్దరు మనుషులూ రావిచెట్టు సమీపించారు. ఆడది చిన్నరాగంతీస్తున్నట్టు పసికట్టాడు మరిడయ్య. అది రాగం కాదు శోకండం. ఆకుర్రవాడికి మూడేళ్ళుండొచ్చు. తోటకూరకాడలాగ వేలాడబడిపోతున్నాడు. మగమనిషి యాడవడం లేదు. మొహం అంతకంటే దారుణంగా వుంది. బెగులు బెగులుగా వున్నాయి వాళ్ళ చూపులు. ఆ కుర్రవాడు అసలు చూట్టంలేదు. కళ్ళు లోతుకుపోయి వున్నాయి. ఆ మొహంలో జీవకళ లేదు.

ఆ మనుష్యుల్ని పోల్చాడు. పేర్లు తెలీదు గాని వాళ్లది కొండవార వూరు.

"బాబా కిష్టబాబా — వా బాబా— వారే" అంటున్నది తల్లి, కుర్రవాణ్ణి కదిలించి.

మగమనిషి బెగులుబెగులుగా గుండెకాయ తెగిపోయేలాగ చూస్తున్నాడు. ఏడిచినా అంతకంటె తెరిపిలావుణ్ణు అన్నట్టు చూస్తున్నాడు.

మరిడయ్యకు బోధపడిపోయింది

## చీకటి చినుకులు

పట్నంలో డాక్టరు దగ్గరికెళ్ళాలి

ఆడమనిషి పయిటచెరగున పొట్లం కనపడింది

మరిడయ్యకు ధైర్యం వచ్చింది. అందులో డబ్బులుండివుంటాయి

కుర్రవాడు చావుబతుకుల్లో వున్నాడంటే కుండా ముంతా అమ్మి సయినా సొమ్ము పట్టుకునుంటారు.

''యేటయ్యిందేటి'' అన్నాడుమరిడయ్య, రిక్షా తారురోడ్డు మీదకుతెచ్చి.

సరిగ్గా వారం రోజులాయి కిష్ణబాబుకి జబ్బు. ఏం జబ్బు అన్నది మనకి తెలీదు. అగ్రహారంలోవున్న పంతులుగారి వైద్యం. తగ్గలేదు. ముదిరిపోయింది. పట్నం తీసుకెళిపోండి అని చెప్పేసరికి కిష్ణబాబు కాళ్ళూ చేతులూ చల్లబడిపోయాయి. మెడ వేలవేసేశాడు. అగులూ బొగులూ మంటూ పొలాలకడ్డంపడి నడిచిరోడ్డు చేరుకున్నారు. అదీ కథ. ఈ నాలుగుముక్కలూ చెబుతూ ఆడది నాలుగుసారు చీదింది. మొగమనిషి మొహంలో ఎక్కడా కత్తివేటుకి నెత్తురు లేదు. అతని పొట్ట వెన్నుకు అంటుకుపోయి. అతని కళ్ళు ఎక్కడోలోతుకుపోయివున్నాయి ఆ కళ్ళల్లో వెతుకుదామన్నా నీళ్ళు లేవు.

''బేగెక్కండి బేగెక్కండి'' అన్నాడు మరిడయ్య.

గాలి చల్లగా వొళ్ళు చిల్లులు పొడిచేలా వీస్తోంది.

మబ్బులు కాటుక పూసుకుని తరుము కొస్తున్నాయి, మృత్యువులాగ. పొద్దు వాల లేదు గాని రాత్రయి పోయినట్టే వుంది.

''సూదు నేస్తం, అయిదు రోడ్ల జంక్షన్లో సింగ్డాక్టర్కాడికి పోనీ'' అన్నాడు రిక్షాలోంచి, మగమనిషి. బుజాన్నున్న పాతతీసి కప్పాడు కుర్రాడికి. తల్లి కుర్రాడికాళ్ళూ చేతులూ తనచేతుల్తో రాస్తోంది వెచ్చదనంకోసం.

అది శీతాకాలంకాదు అది వానాకాలమూ కాదు. అది ఎండాకాలం. ఎండలు పేల్చి పేల్చి—మూడురోజులయి మబ్బులు, వానా పట్టుకుంది నిజానికది కొండరాళ్ళు పగల పలిసిన గ్రీష్మఋతువు.

ముందురోజు మిగిలిన పదిపైసలూ బీడీలు కొనిశాడు. బియ్యమూట మిల్లుకు తెచ్చినందుకు సంపాయించుకున్న పావలా తోటీ, మరోపావలా అరువెట్టి రావిచెట్టు కింద టీకొట్లో ఒకరొట్టెతిని టీ నీళ్ళు తాగాడు. ఆ రొట్టె మ్యాడోలునాటిదే. అయితేనేంగాక అరువిచ్చింది అంతే చాలు. అసలే టీకొట్టు పార్వతమ్మ రాకాసిది. అదిగో అల్లాంరొట్టెకిమించి కడుపులో మరేం లేదు. అమ్మతోడు. చంపుకు తినేసినం తొట్టు. ముందురోజు మధ్యాహ్నం గుప్పెడన్నం యింతగంజీ తాగాడు. ఆ మావులు మళ్ళీ వుత్తిగంజే. అయితే అది అతనితప్పే పట్నంనుంచి వస్తూ వస్తూ డబుల్ జీరో మీదొక పావలా, డబుల్ సెవెన్ మీదొక అర్ధ రూపాయీ గ్రాకెట్టు కట్టేశాడు పావలా పుగాక్కాడ కొనేశాడు. రూపాయి చెల్లు. పెళ్ళాం తిట్టిపోసింది. యింత పుగాకుపాయ తీసి దానిచేతిలో పెట్టాడు. అది యిన్ని గంజినీళ్ళుపోస్తే తాగి కడుపులో కాళ్ళు పెట్టుకుని పడుకున్నాడు.

మరిడయ్య గబగబా రిక్షాలాగుతున్నాడు.

ఆడమనిషి అలారాగం తీస్తూనేవుంది.

మరిడయ్య బొత్తిగా ఒంటిపేగుమనిషి. కష్టం నోర్చలేడు. తనుపడలేడు. మరోడు పడితే చూడలేడు. అసలు మొదట ఈ రిక్షాకూడా తొక్కలేకపోయేవాడు.

మరిడయ్యకు చిన్న సైకిలుషాపుండేది. దానికి అనుబంధంగా సోడాకొట్టుండేది. నాలుగు సైకిళ్ళుండేవి. రెండుసైకిళ్ళు దొంగలెత్తుకుపోయారు. ఒకసైకిలు పోలీసులు దొంగ సైకిలన్న అనుమానంతో ఎత్తుకుపోయారు. మరోసైకిలు అతనే అమ్మేశాడు. సోడాకొట్టు కొన్నాళ్ళు కోడిగట్టిన దీపంలాగ సాగి సాగి చతికిలబడి పోయింది. సైకిలూ, బడ్డీ అమ్మి – నానా గడ్డిగరిచి ఈరిక్షా కొన్నాడు ఎనిమిదివందలకి, రెండేళ్ళకి అక్కడకది కారుచౌక. సైకిలుషాపు బాగున్నరోజుల్లో మరిడయ్యకి ఏర్రమ్మని ఒక ముండుండేది. దానికోసారి ఉంగరంకూడా చేయించిపెట్టాడు. మనిషి మాంచి పొంకంగావుండేది. కాని...సరే. ఏందుకొచ్చినగొడవ. అంతా చాలా పెద్దకథే వుంది.

పెద్దమదుంవరకూ వచ్చారు.

చీకటికాస్త చిక్కబడింది. పడమరన చిన్నతెల్లచీర లేకపోలేదు.

చినుకులు కాస్త పెద్దవయ్యాయి.

''నాయన్నాయన బేగెల్లి బేగెల్లి — అంటున్నాది రిక్షాలో ఆడమనిషి. మరిడయ్య మృత్యువుమశంకిస్తూనేవున్నాడు. గుండెల్లో నిండానీళ్ళు పోసేసినట్టు బరువుగా వుంది. దుఃఖంతో బాధతో వొణుకుతోంది. మరిడయ్యదిబొత్తిగా జాలిగుండె. అదిగదే యింతపనిచేసింది.

మరిడయ్యకు యిద్దరు కొడుకులూ ఒక కూతురూను. కూతురు, అమ్మవారు పోసి చూస్తూ చూస్తూ వుండగానే చచ్చి పోయింది. కూతురు చచ్చిపోయిన రోజు జ్ఞాపకం వచ్చింది మరిడయ్యకి. ఎంత

### కవిత!

కళ్ళు చూపిన వాస్తవాన్ని
ఆలోచిస్తూ—
మస్తిష్కంకాలం వెచ్చిస్తే
అలజడి, సంఘర్షణల
రాపిడిలోనుంచి
పుట్టిన చైతన్యం
హృదయాన్ని కదిలిస్తే
స్పందించిన హృదయం
కదిలించిన కలం
ఉత్తేజంతో
ఉద్వేగంతో
పాడినగీతం
కవిత!

— పాయసం సుబ్రహ్మణ్యం

### ఇరాన్లో మన డాక్టరలకు స్వస్తి

మొత్తం కాలం ప్రభుత్వానికే సేవ చేసే ఒప్పందాన్ని ఉల్లంఘించి ప్రవేటు ఆస్పత్రులు తెరుస్తున్నారన్న ఆరోపణపై ఇరాన్ 10 మంది భారత, పాకిస్తాన్ వైద్యులను బహిష్కరించిందని ఆరోగ్య శాఖ మంత్రి జనవరి 19వ తేదీన టెహరాన్లో ప్రకటించారు. ఈ బహిష్కరించిన వైద్యులు ప్రభుత్వంచే గ్రామాల్లో పని చేయటానికి నిర్దేశింప బడ్డారు. కాని వారు అదే గ్రామాలలో వేరే ఫీజులు తీసుకొని ప్రాక్టీసులు పెట్టారు.




## స్తుతి - నిందలు

తనయందు ఎంతో భక్తి ఉన్న భక్తులకైనా సరే, భగవంతుడు సులభంగా వరం ఇవ్వడు. వారెంతో బాధపడినమీదట—వారిని అనుగ్రహించడం జరుగుతుంది. సర్వసంగ పరిత్యాగంచేసిన మహామునులుఎంతో ఘోరంగా తపస్సుచేసిన తర్వాతనే అనుగ్రహించడం జరుగుతున్నది. అట్టిస్థితిలో సంసారంలో పడి కొట్టుమిట్టాడుతున్న సామాన్యులను గురించి వేరే చెప్పనక్కర్లేదు కదా ! సంసారులు తమ స్తోత్రాలవల్ల ఫలితం కానరాక పోగా, భగవంతుణ్ణి నిందించడం కూడా జరుగుతున్నది. అలా నిందించిన తర్వాతనే వాళ్ళసంకల్పం నెరవేరుతున్నది. ఆ నింద తనపైగల అపారభక్తికే సూచకమని భగవంతుడు భావిస్తాడని చెప్పవచ్చును. ఆ పరమపురుషునికి భక్తుల నిందాస్తుతులు రెండూ సమానమే !

స్తుతివల్ల తమకార్యం ఫలించకపోగా, తాము నమ్ముకున్న స్వామిని నిందించి కార్యం సాధించిన సంఘటనలు ఎన్నోఉన్నవి. వాటిలో రెండిటిని ఉదాహరణకు తీసుకోవచ్చు.

రామదాసు నామంతో ప్రఖ్యాతుడైన కంచెర్ల గోపన్న భద్రాచలంలో శ్రీరామచంద్రునకై సర్కారు సొమ్మును లక్షలకొలది ఖర్చు చేశాడు. ఆ అపరాధానికయి నిజాం ప్రభువు అతనిని చెరలోపెట్టి హింసించాడు. తన్ను రక్షించాలని రామదాసు శ్రీరాముని ప్రార్థించినా ప్రయోజనం లేకపోయింది. విసుగెత్తి నిందించిన తర్వాతనే రామ లక్ష్మణులు రామదాసుని భృత్య వేషంతో అర్ధరాత్రి తానీషాకు పైకం చెల్లించి భక్తునికి విడుదల కలిగించారు.

సింహాచల క్షేత్రాన్ని దోచుకొనుటకు తురకలదండు విశాఖపట్నం మీదుగావస్తున్న సమాచారం ముందుగా తెలిసి గోగులపాటి కూర్మనాథకవి శ్రీ వరాహ లక్ష్మి నరసింహ స్వామి సన్నిధిలో దీక్షతో కూర్చుండి సింహాద్రి నారసింహశతకం చెప్పడం ప్రారంభించాడు. మొదట్లో దేవుణ్ణి స్తుతిస్తూ, ప్రజలనూ, తన దేవాలయాన్నీ రక్షించాలని ప్రార్థించాడు. ప్రయోజనం లేకపోయింది. దోపిడిదండు (తుమ్మెదల) మెట్టను సమీపిస్తున్నట్లు తెలిసింది. తర్వాత, కవి ఉద్రేకంతో స్వామిని నిందిస్తూ పద్యాలుచెప్పాడు. ఆ దేవదేవుడు అనుగ్రహించి తుమ్మెదల దండును పంపి, తురకల దండును అక్కడి నుండి వెంట తరిమి అపాయం తప్పించాడు తర్వాతనే ఆ మెట్ట తుమ్మెదల మెట్ట అని పేరు పొందింది.

---

వీరగా వుండేదో. బ్రతికివుంటే నేటికి పన్నెండేళ్ళుణ్ణు. పోనదలా యింగా? రెండో కొడుకును లారీ మట్టించేసింది. వాడు ఎప్పుడూ కునికిపాట్లు పడుతూనే వుండేవాడు. ఏ రోగమూ లేకపోయినా రోగిష్టిలాగా వుండేవాడు. ఎనిమిదేళ్ళ వయసులో అలాగయిపోయాడు. అర్నెల్లు తిప్పితిప్పి వెయ్యి రూపాయిలిస్తామని – అన్ని కమిషన్లు పోనూ ఆరొందలు చేతిలో పెట్టారు. పోయిన కొడుకు ఎలాగూరాడు, ఎదవ ఆరొందలు ఎందుకు పుచ్చుకున్నావూ, పారీ అళ్ళ మొహాన్నే అన్నది పెళ్ళాం. అవున్నిజమే. మరి డబ్బో! ఈనాటికి యింటి ఆడదానికి తెలీదుగాని మరాడబ్బుతోనే ఎర్రమ్మకి సీలం పొడి వేసిన ఉంగరం వేయించి– మాంచి చీర కొన్నాడు తక్కిన సొమ్ము జలసా చేయించాడు. ఇప్పుడా భోగట్టా జ్ఞాపకం వచ్చి చాలా పశ్చాత్తాపంతో ఛీ ఛీ—నేనేం

## చీకటి చినుకులు

మనిషిని అనుకున్నాడు మరిడయ్య.

"పదనాయినా—తరుముకెళ్లి పోస్తుంది. రొజ్జగాలొకటి" అన్నది రిక్షాలోంచి ఆడమనిషి.

"నాయనా కిష్ణబాబూ– సూడవా – నాదుక్క సూడవా" అంటున్నాదా తల్లి హృదయవిదారకంగా.

"పల్లకోయే—యిప్పుడు కదిల్నాడుగాడా— అన్నిటికే ఆ బగమంతుడున్నాడు. సింగు డాక్టరు సెయ్యి నలవవ నయమయి పోయిందా..." అని ఆగేడు. అవ్వకపోతేనో అన్న ప్రశ్న వేసుకుందుకు ధైర్యం చాల్లేదు. మొహం దాచేసుకున్నాడు. మెడ పొడుగు కావడంవల్ల గడ్డం గుండెల కానీసింది. మెడ నులిమీసిన కోడిలా వున్నాడు.

మరిడయ్య రిక్షా దిగి లాగడం ప్రారంభించాడు. అక్కణ్ణించి వూడా వాళ్ళ పెట్రోలు బంకు దాకా అంతా ఎగువే. బస్తీలో దీపాలు అల్లంత దూరంలో మిల మిల లాడుతూ కనబడుతున్నాయి. వీరాజా టాకీస్‌లో లొలాటకి రికార్డులు వేస్తున్నారు. సినిమాకు వెళ్ళే జనం పరుగులాగ నడుస్తూ రిక్షా దాటిపోయారు. వాళ్ళు సినిమా కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు.

మరిడయ్య పెద్దకొడుకు ఒకత్తిని తీసుకుని లేచిపోయాడు. వైజాగ్‌లో వోడల రేవులో మూటలు మోసుకుంటున్నాడని, యిప్పుడు వాడి పని బాగానే వుందనీ పట్నం నుంచి వచ్చిన బ్రహ్మం చెప్పాడు. యదవ— యదవన్నర యదవ. తల్లినీ, తండ్రినీ సూడనోడు ఆడూ వొక్కొడుకేనా– థూ– మరిడయ్యకు కష్టం వేసింది. ఉన్నట్టుండి ఈ బతుకెంతో భారంగానూ మొయ్యడం అసాధ్యంగానూ కనపడింది. ఊపిరి బిగబట్టి

బరువు లాగుతున్నాడు. బస్తీలోకి రానే వచ్చాడు. అల్లా కనిపించేదే పూరా వాళ్ళ బంకు. వోపిక వట్నాదు గబగబా పరుగు లాగ నాలుగడుగులు లాగి గబుక్కున రిక్షా సీటెక్కి తొక్కడం ప్రారంభించాడు. అమ్మయ్య! రిక్షాలో కూచున్న మనుషు లిద్దరూ చాలా బరువున్నట్టు కనిపించారు. కాదు కాదు ఆ గుంటడు బరువెక్కిపోయుంటాడు. చచ్చిపోయాక మనుషులు బరువెక్కిపోతారట. మరా కుర్రాడు... ఛ... తప్పుడాలోచనలు ...

సింగు డాక్టరు సెయ్యిబడితే బతీకాడా? మళ్ళీ తానే వాళ్ళని రావిచెట్టు జంక్షన్‌లో దిగబెట్టాడా ?— వాళ్లప్పుడు సంతోషించి మరో పావల్డబ్బులు పారీరా ? ఇలా ఆలోచించుకుంటూ రిక్షా జోరుగా పోనిచ్చాడు.

కాటికలాంటి చీకటిని కరెంటు దీపాలు తరిమితరిమి కొడుతున్నాయి. అయిదు రోడ్ల జంక్షన్‌లో అంతా పట్టపగల్లా వుంది.

రిక్షా పక్కకితీసి ఆపాడు మరిడయ్య.

ఆ పక్క డాబా యిల్లే సింగు డాక్టరు ఆస్పత్రి.

సాయింత్రం ఏడుగంటల సమయం. బస్తీరోడ్లన్నీ మాంచి రదీగా వున్నాయి. చినుకులులేవు ఉండీ ఉండీ ఒక్కొక్క తుంపర. ఆ చినుకుల్ని ఎవ్వరూ లెక్క చెయ్యడం లేదు.

ఇద్దరూ రిక్షా దిగేరు.

ఆడమనిషి పయిటచెంగున పొట్లం విప్పి "యిందా డబ్బులు" అన్నాది ఫైలిమిటితో.

"నా డబ్బులిచ్చీ" అన్నాడు మరిడయ్య.

"యిచ్చేస్తాం నాయనా — కొడుకును డాక్టరుబాబుకు సూపించనియ్యవా" అంది గట్టిగా ఏడుస్తూ, ఆడమనిషి. "ఒక్క సిటం సుంచో" అని కూడా అంది.

మరిడయ్యకు మరినోరు పెగల్లేదు.

ఇద్దరూ సింగు డాక్టరు ఆస్పత్రిలోకి గబగబా తూలుతూ, దుఃఖంతో వాలిపోతూ వెళ్లారు.

మరిడయ్య రిక్షాలో కూచుని చుట్ట ముట్టించాడు. పదిహేనుపైసలు —అంతే— పదిహేనుపైసలుంటే చాలు టీ తాగును. ఏడీ ఎవరున్నాడు యిచ్చేదాత. మరిడయ్యకి ఏభైయ్యేళ్లు దాటాయి. మనిషి బొద్దుగా పుష్టిగా వున్నట్టు కనపడతాడు. కాని ఒట్టి ఒంటిపేగు మనిషి. కష్టం వోర్చలేడు. చూడలేడు. రోడ్డువార చచ్చిపోయిన కుక్క కనపడితే కడుపులో దేవేసినట్టయిపోయి అన్నంనోట్లో పెట్టుకోలేడాపూట. శవాన్ని చూసే చాలు మనసు చెదిరిపోతుంది.

మరిడయ్యకి క్షాలోనేకునుకువచ్చేసింది.

* * *

రాత్రి తొమ్మిది గంటలయి వుంటుంది. తొలి సినిమా వదల్లేదు.

మరిడయ్య రిక్షా పట్నంలోంచి బయలుదేరి రయ్యిరయ్యమని రావిచెట్టు జంక్షన్ వైపు శరవేగంతో పరుగుతీస్తోంది. ఇప్పుడది బరువుగా లేదు. తేలిగ్గావుంది. అంతా డౌను. పెద్దమదుం. దాటిందాకా పెడల్ మీద కాలు వెయ్యక్కర్లేదు.

చచ్చిపోయినవాళ్ళు బరువెక్కరు. తేలిగ్గానే వుంటారు. ఆ కుర్రాడు చాలాసేపయి చచ్చిపోయాడు. సింగు డాక్టరు చాలామంచివాడు. చేతిచలవగలవాడు. కాని ప్రాణం పట్టుకురాలేడుగద! కుర్రాడితండ్రి ఇచ్చిన అయిదురూపాయలకే — మంచియింజక్షన్, కరక్టయిన యింజక్షన్ కూడా యిచ్చాడు. కాని చెయిదాటిపోయింది అంతాను.

ఆడమనిషి శోకంకాలకు అంతులేదు. తండ్రిముఖం దుఃఖంతో లోతుకుపోయింది.

మరిడయ్య భయపడ్డంతా అయింది.

చంటికుర్రాడి శవంతో పట్నంలో వాళ్లెక్కడుంటారు? మరంచేత వీళ్ళని తీసుకెళ్ళి యిల్లుజేర్చేస్తే యాడవనన్నా ఏడుస్తారు.

తండ్రికళ్లల్లోంచి తడి దీపాలవెలుతురులో తళుక్కున కనిపించింది మరిడయ్యకు వాళ్లకంటె ముందు అతనికే దుఃఖం ఆగడంలేదు.

ఒక్క నిమిషం చూశాడు.

రిక్షా ఎక్కండన్నాడు. అంతకంటే అతనేం చెయ్యగలడు?

రిక్షా తేలిగ్గా విసురుతోందా అనిపిస్తోంది. డబ్బుల్లేని మనుషులు తేలిగ్గా వుండరూ? కడుపులోపేగులు చుట్టుకుపోతున్నాయి. నిండిపోయి కట్టలు తెగడానికి సిద్ధంగావున్న చెరువులావుంది మనసు.

చీకటి మృత్యువులాగ చిక్కగా వుంది.

చినుకులు రాల్తూనే వున్నాయి.

మరిడయ్య ఆకాశంవేపు చూశాడు. ఒక్కచుక్కకూడా కనపడ్డంలేదు. లోకాన్నంతా చీకటి మింగేసినట్టు భయంకరంగా వుంది. నక్షత్రాలు మాడిపోయి చీకట్లో కలిసిపోయి వుంటాయి.

చినుకులు అలా రాల్తూనే వున్నాయి.

చీకటికరిగి చినుకులుగా పడుతున్నాయా అనిపిస్తోంది.

కిష్టబాబు శవాన్ని పట్టుకుని రిక్షాలోంచి తల్లి ఏడుస్తూనేవుంది. ఆ ఏడుపుతో నక్కల అరుపులు లయ కలుపుతున్నాయి.

మృత్యువుకు జాలిలేదు.

మృత్యువుకు తిరుగులేదు.

చీకటికరిగి చినుకులు రాల్తున్నాయి.



## పెద్దకథ ప్రారంభం

**సిగిరెట్టు చివరి దమ్ము లాగి-దాన్ని కిటికీలోంచి బయటికి విసిరేసి, వాచీ చూసుకున్నాను.**

తొమ్మిదీ నలభై అయిదు!

అంటే—

ఈపాటికి వాళ్ళిద్దరూ బయల్దేరుంటారు.

వాకిట్లోకి వచ్చి నిలబడ్డాను.

వాళ్ళిద్దరూ అప్పుడే మలుపు తిరిగి రోడ్డెక్కారు. పక్కవీధిలో వుంటున్నట్టున్నారు. రోజూ మా యింటిముందు నించే వెళ్తుంటారు.

ఇద్దరూ వుద్యోగం చేస్తున్నట్టున్నారు! ప్రతీ రోజూ శంకరమఠం దగ్గర బస్సు కోసం నాతోపాటు వాళ్ళూ నిలబడతారు. ముగ్గురివీ వేరువేరు మార్గాలవడంచేత ఒకే బస్సులో ప్రయాణం చేయడం మాత్రం జరగలేదు.

వాళ్ళిద్దరి దాంపత్యం చూస్తుంటే ఎంతో ముచ్చటగా వుంటుంది. వాళ్ళ మాటల్లోను, నడవడిలోను కన్పించే అన్యోన్యత, అనురాగం ఎంతో అరుదుగా కనబడతాయ్! దాదాపు రెండు నెల్లనించీ వాళ్ళని గమనిస్తూనే వున్నాను. తొమ్మిది ముప్పావు ప్రాంతంలో బయల్దేరి— నవ్వుతూ తుళ్ళుతూ బస్‌స్టాప్ చేరుకుంటారు. వాళ్ళ వెనకే నేనూ బయల్దేరుతాను. ఆమె నవ్వుతూ బస్సెక్కేవరకూ అతను నేచి వుంటాడు.

ఆమె బస్సెక్కేప్పుడు గమనించాలి వాళ్ళిద్దర్నీ! ఆ మొహాల్లో ఎంత బాధ, ఆవేదన, విరహవేదన!

—ఇంతలో అతని బస్సొ, నా బస్సో రావడం— మేం విడిపోవడం జరుగుతుంది. ఆమె బస్సెక్కి వెళ్ళిపోయే వరకూ వేచి వుండటం అతనితోపాటు నాకూ అలవాటైపోయింది.

వాళ్ళిద్దరూ మా యింటి ముందు కొచ్చారు.

గదికి తాళం వేసి నేనూ బల్దేరాను.

ప్రతీ రోజూ బయల్దేరగానే ముందు రూమ్ కెదురుగా వున్న గడ్డియ్య కిళ్లీ



# కొత్త జీవితం

వేదగిరి రాంబాబు
మైనంపాటి భాస్కర్

కొట్టు దగ్గర ఆగి, ఒక ఫోర్ స్క్వేర్ పాకెట్ అందుకొని బయల్దేరడం అలవాటు. అతనికీ ప్రతిరోజూ ఇది అలవాటే కాబట్టి నన్ను చూడగానే ఫోర్ స్క్వేర్ పాకెట్ అందిచ్చాడు. దాన్నందుకుని, డబ్బులిచ్చి శంకరమఠంకేసి బయల్దేరాను.

ముందు వాళ్ళిద్దరూ— వెనక నేను.

అతను లేత నీలంరంగు పాంటు, షర్టు వేసుకున్నాడు. ఆమె అదే రంగుచీర, బ్లౌజు వేసుకుంది!

అతను నవ్వుతూ ఏదో చెప్తున్నాడు. ఆమె చిరునవ్వుతో వింటోంది!

... మధ్య మధ్య ఆమేదో అంటోంది ఆమె మాట్లాడినప్పుడల్లా అతను ఫక్కున నవ్వేస్తున్నాడు!

వాళ్ళేం మాట్లాడుకుంటున్నారో వినాలని నే నెప్పుడూ ప్రయత్నించలేదు. వాళ్ళలా నవ్వుకుంటూ... తుళ్ళుకుంటూ చిలకా గోరంకల్లా వెళ్తుంటే చూట్టానికెంతో ముచ్చటగా వుంటుంది. అందుకె వాళ్ళ వెనకే బయల్దేరడమంటే నా కదో సర్దా!

ఆఫీసులకి వెళ్ళేవాళ్ళతోను; స్కూళ్ళకీ, కాలేజీలకీ వెళ్ళేవాళ్ళతోనూ, రోడ్డు చాలా సందడిగా వుంది. అంతమందిలోనూ ఆ జంట ప్రత్యేకత కొట్టొచ్చినట్టు కన్పిస్తూనే వుంది!

బస్‌స్టాప్‌కి చేరుకునేసరికి అప్పటికేరెండు బస్సుల జనం నిలబడున్నారక్కడ. వాళ్ళి ద్దరికి కొద్దిగా ఎడంగా నిలబడ్డాను.

మరో సిగరెట్టంటించాను కాలక్షేపం కోసం. ఈ అలవాటు నేను కాలేజీలో చేరిన కొత్తలో ఎప్పుడో మొదలైంది. అప్ప ట్నించీ... ఇలా వంటరితనంగా అన్పించి నప్పుడుకాని, చిరాగ్గా వున్నప్పుడుకాని సిగరెట్ తప్పకుండా వుండి తీరాలి. సిగరెట్టే నాకు మంచి మిత్రుడు.

చుట్టూ జనమున్నారన్న ధ్యాసకూడా లేకుండా వాళ్ళిద్దరూ సర్దాగా అలా మాట్లాడుకొంటూనే వున్నారు.

—వాళ్ళిద్దరూ ఒకళ్ళ మరొకళ్ళకోసం సృష్టించబడ్డారు. అన్ని విధాలా కట్టిపోయే భార్య దొరకడం అతని అదృష్టం! మగవాడి జీవితంలో పెద్ద అదృష్టం అతన్ని పూర్తిగా అర్థంచేసుకొని, అభిమానంతో మెల్గే భాగస్వామి లభించడమేనని నా వుద్దేశం. అట్లాంటి దంపతులు తామానం దాన్ని పొందడమే కాకుండా చూసేవాళ్ళ క్కూడా ఎంతో వుల్లాసాన్ని కల్గిస్తారు.

మూడో నెంబరు బస్సు వచ్చింది.

అక్కడున్న జనంలో మూడో వంతు పైనే ఆ బస్సుమీద కెగబడ్డారు. ఆమె అతని చేతిని సున్నితంగా నొక్కి వదిలి తనూ బస్సువేపు కదిలింది.

బస్సెక్కబోతూ ఆమె అతనివేపు చూసిన చూపులో ఎంతో దిగులు, బాధ! అంతే దిగులు, బాధ అతనామెని చూసే చూపుల్లోనూ వున్నాయ్!

ఇంతలో నే నెక్కాల్సిన బస్సురావడంతో చేతిలోనున్న సిగరెట్టుని పారేసి, ఆలోచన్లకి తాత్కాలికంగా స్వస్తిచెప్పి, అటువేపు పరు గెత్తాను.

బస్సు నిండిపోయింది. మనిషి మీద మనిషితో. చాలా చికాగ్గా వుంది. ఇలా ప్రయాణంచేసి వెళ్ళి ఆఫీసులో పని చేయా లంటే అదో పెద్ద శిక్ష! కానీ తప్పదు. నా లాంటి మధ్యతరగతి మనిషి రోజూ ఆటో ల్లోనూ, రిక్షాల్లోనూ తిరగలేడు. ఎంత నరకమైనా బస్సేగతి. లేకపోతే నడక! ఈ జంట నగరాల్లో ఇల్లు దొరకడమే పెద్ద సమస్య. అటువంటిది ఆఫీసుకి దగ్గ ర్లోనే ఇల్లు దొరకాలంటే చాలా కష్టం.

ఒకచోట్నించి మరోచోటికి వెళ్ళాలంటేనే మైళ్ళకి మైళ్ళు దూరాలు.

బస్సు ప్రతీ స్టాప్‌లోనూ ఆగుతోంది, బయల్దేరుతోంది.

దిగేవాళ్ళిద్దరు ముగ్గురుకన్నా వుండటం లేదు. ఎక్కేవాళ్ళు ప్రతిస్టాప్‌లోనూ కనీసం పదిమందైనా వుంటున్నారు! ఆఫీసులకెళ్ళే వాళ్ళతోను; స్కూళ్ళకీ, కాలేజీలకీ, వెళ్ళే వాళ్ళతోనూ ఈ సమయంలోనూ, సాయంత్రం ప్రతిరోజూ బస్సులింతే!

ఆ ఇరుకులోంచే అభిమన్యుడు పద్మవ్యూహంలోకి చొచ్చుకు పోయినట్లు చొచ్చుకుపోయి టికెట్లిస్తున్నాడు కండక్టర్!

నడుస్తున్న నరకం! బస్సు బషీర్‌బాగ్ చేరుకొంది సగంమంది దిగిపోయారు. నేనూ దిగాను. ముందు వించీ శశిరేఖ, ప్రసాద్ దిగారు. వాళ్ళిద్దరూ మా ఆఫీసులోనే పని చేస్తారు. నారాయణ గూడాలో ఇల్లు.

'వాళ్ళిద్దర్నీ' ప్రతిరోజూ బస్సెక్కక ముందెలా చూస్తుంటానో, 'వీళ్ళిద్దర్నీ' బషీర్‌బాగ్‌లో బస్సు దిగింది మొదలు తిరిగి సాయంత్రం బస్సెక్కేవరకూ అలానే చూస్తుంటాను.

రెండు జంటలూ భార్యా భర్తలే రెండు జంటలవీ దాదాపు ఒకే వయసు! అయినా రెండు జంటల మధ్య ఎంత వ్యత్యాసం!

వాళ్ళు ఒకళ్ళని విడిచి మరొకళ్ళుంటానికి తల్లడిల్లిపోతుంటారు. వీళ్ళు ఒకళ్ళతో పాటు మరొకళ్ళు ఇంటిదగ్గరే కాకుండా ఆఫీసులో కూడా కల్సివుండాల్సొస్తోందే అని తల్లడిల్లి పోతున్నట్లుంటారు!

వాళ్ళిద్దరూ హుషారుగానైనా పోట్లాడు కోటం చూళ్ళేదు. వీళ్ళిద్దరూ నవ్వుతూ—తృప్తిగా మాట్లాడుకోవడం చూడలేదు.

వాళ్ళిద్దరికీ ఒకళ్ళ మాటంటే మరొకళ్ళకి వేదవాక్కు. మరి వీళ్ళు — అతను మాట్లాడితేనే వణికిపోతుందామె, ఆమె మాట్లాడితేనే చిదరించుకుంటాడతను.

ఈ రెండు జంటల మధ్య ఈ వ్యత్యాసానికి కారణం?— ఇది నా కర్థంకాని ప్రశ్నై కూర్చుంది.

వాళ్ళిద్దరూ—పక్కన మరో మనిషున్నాడన్న ధ్యాస కూడా లేకుండా ఎవరి ఆలోచనల్తో వాళ్ళు నడుస్తున్నారు. వాళ్ళ వెనకే నేను నడుస్తున్నాను.

## కొత్త జీవితం

కొంతమంది ఆనందంలో కన్నా దుఃఖం లోనే ఎక్కువ తృప్తిని పొందుతూంటారు. అలాగే వీళ్ళిద్దరుకూడా సఖ్యతగా వుండటంకన్నా— ఇలా ఎడమొహం, పెడమొహంగా మెలగడమే ఆనందమేమో!

ఆఫీసుకి చేరుకున్నాం అక్కడ ఏమాత్రం మార్పులేని ఆఫీస్ పని మా కోసం ఎదురు చూస్తోంది. ఎవరి పనుల్లో వాళ్లం పడిపోయేం...

సాయంత్రం అయిదున్నరైంది. సీట్లోంచి లేచాను.

> **అంకితం!**
>
> కళ్ళు—
> మూసుకోవటానిక్కాదు;
> చూట్టానికే!
> బతుకు —
> ముడుచుకోవటానిక్కాదు;
> ఎగరటానికే!
> దీపం—
> చావడానిక్కాదు;
> వెలగడానికే!
> అలాగే—గీతంకూడా!
> గీతం—
> నిద్ర పుచ్చడానిక్కాదు;
> మేల్కొలపటానికే!!
>
> — నందిని సిధారెడ్డి.

శశిరేఖ ఇంకా ఏదో రాస్తోంది! టైమైపోయింది ఇంటికి వెళ్దాం అనే ధ్యాస ఆమెలో ఎక్కడా లేదు.

అవును పాపం! ఇంటికన్న ఆఫీసే ఆమెకెక్కువానందాన్నిస్తోందేమో!

"అయిదున్నరైపోయింది. ఇంకా ఏంటీ సీరియస్‌గా రాసేస్తున్నారు" ఆమె సీటు దగ్గర కెళ్ళాను.

"అబ్బే! ఏంలేదండి. ఈ స్టేట్‌మెంట్ కాస్త చూసి వెళ్దామని..."

"అయిదున్నరైపోయిం తర్వాత కూడా ఇంకా వాటితో కుస్తీ పట్టడాన్కి మీ కెంత ఓపికండి" చిన్నగా నవ్వాను.

ఆమె నవ్వింది.

"ఇంక బయల్దేరుతావా?" తీవ్రతతో కూడిన కంఠం విన్పించేసరికి ఇద్దరం అటు చూశాం.

ఎప్పుడొచ్చాడో ప్రసాద్ గుమ్మం దగ్గర నిలబడున్నాడు. అతని మాటల్లోనే కాదు చేతలో కూడా తీక్షణత కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది అతని ఆ ప్రవర్తన మామూలే అయినా మరో వ్యక్తి ముందు భార్యనలా అనేసరికి వళ్ళు మండింది. అయినా నేనేం చేయగల్ను? అసహ్యంతో చూపు అతనివేపు నించి పక్కకి మరల్చాను

అతని కోపాన్ని పసిగట్టి మౌనంగా చేతిలోని ఫైల్ని డ్రాయరు సొరుగులో పడేసి, దానికి తాళంవేసి లేచింది శశిరేఖ.

ఆమె అవస్థని గమనించి, వస్తానని చెప్పి గబగబా బయటికొచ్చేశాను.

ఆఫీసైపోగానే ఏదో హోటల్లో కాఫీ తాగి కాసేపలా... అలా తిరిగి దాదాపు ఏడు గంటల ప్రాంతంలో రూమ్‌కి చేరుకోవడం అలవాటు. ఓ సిగరెట్ వెలిగించి నెమ్మదిగా అబిడ్స్ వేపు బయలుదేరాను

భార్యాభర్తలకి పెద్ద శిక్షేమిటంటే శశిరేఖలాంటి దాంపత్యం. ఒకళ్ళు మనసు విప్పి మరొకళ్ళతో మాట్లాడుకోలేరు. అతను చిటపట— ఆమె మౌనం! అటు వంటి దాంపత్యం కన్నా అసలు పెళ్ళే చేసుకోకపోవడం మంచిది.

తనకోసం ఆప్తులందర్నీ విడిచి వచ్చిన భార్య యెడల ప్రేమ చూపించలేని మనిషి మనిషేకాదు అలాగే భర్తంటే అభిమానం, ఆదరణ, గౌరవంలేని భార్య భార్యే కాదు. అసలు ఒకళ్ళంటె మరొకళ్ళకి అభిమానం లేదు, కలగదు అనుకున్నప్పుడు పెళ్ళెందుకు చేసుకుంటారు? ఒకవేళ చేసుకున్నారూ— అప్పుడు జీవితాంతం ఒకళ్ళ సాహచర్యం, సానుభూతి మరొకళ్ళకి కావాలని తెల్సికూడా సర్దుకుపోడానికెందుకు ప్రయత్నించరు?

నరకమంటే వేరేలేదు ఇటువంటి దాంపత్యమే!

శశిరేఖ, ప్రసాద్‌లు కన్పించినా; వాళ్ళ గురించి ఆలోచించినా అసలు పెళ్ళంటేనే విముఖత కల్గుతోంది.

హోటల్లో కాఫీతాగి— కోఠీకెళ్ళే బస్సెక్కాను.

—శంకరం మఠం దగ్గర బస్సు దిగి, రూమ్‌కి బయల్దేరాను.

# హార్లిక్స్




## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణ-మయిన ఆరోగ్యం చేకురుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే, మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి. దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.

అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది.

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



Hx1648-TAL-1

**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

ౖబిడ్జిదగ్గర వాళ్లిద్దరూ ఎదురొచ్చారు. ఇదీ రోజూ మామూలే.

నేనిలా ఏడుగంటల ప్రాంతంలో రూమ్‌కి తిరిగొచ్చే సమయాన్కి— ఇద్దరూ కూరలు మొదలైనవి కొని కాసేపలా కులాసాగా తిరిగి రావడానికి బయల్దేరుతారు. కేవలం ఆఫీసు సమయంలోతప్ప మిగతా సమయమంతా ఇద్దరూ కల్సే కనబడతారు.

శశిరేఖ వాళ్ల దాంపత్యం చూస్తుంటే ఎంత వైరాగ్యం కల్గుతుందో, వీళ్ల దాంపత్యం చూస్తుంటే అంత ముచ్చట కల్గుతుంది.

రూమ్‌కెళ్లి స్నానంచేసి,కాసేపు కూర్చుని భోజనానికి బయల్దేరాను. దారిలో మళ్లీ వాళ్లిద్దరూ తిరిగొస్తూ కన్పించారు.

ఇలా రోజూ ఈ జంట, ఆ జంట — రెండు జంటలూ కన్పిస్తూనే వున్నాయ్. నాకు తెలీకుండానే వాళ్లని ప్రతీరోజూ గమనిస్తూనే వున్నాను, నా లాంటి బ్రహ్మచారిలో ఆ రెండు జంటలూ ఓ విధమైన సంచలనాన్ని రేపాయంటే పెద్ద విచిత్రమేమీ కాదు!

పెళ్లి అనేది నిజంగానే నూరేళ్ళ పంట. ఒకళ్లనొకళ్ళు అర్థం చేసుకుని, సర్దుకుపోయే వాళ్ళైతే జీవితం ఆనందంగానే గడిచిపోతుంది. లేకపోతే శశిరేఖ, ప్రసాద్‌ల దాంపత్యంలాగానే... నరకం! పెళ్ళైన ఆ మనిషి ఉన్నతిగాని, పతనంగాని పూర్తిగా తమ తమ భాగస్వాముల మీదే ఆధారపడి వుంటుంది. అందుకనే పెళ్లి చేసుకోబోయే ముందు ఆ అమ్మాయి మనస్తత్వాన్ని కొంత

# కొత్త జీవితం

వరకైనా తెల్సుకొని, నాతో ఏకీభవిస్తుందనుకుంటే తప్ప పెళ్లనేది చేసుకో కూడదని నిశ్చయించు కొన్నాను.

ఆ రోజు నేనాఫీసు నించి వచ్చేసరికి రెండుత్తరాలు వచ్చాయ్. ఒకటి పరిచయమైన దస్తూరే— నాన్నగార్ది. రెండవ దస్తూరీ కొత్తది! ముందు నాన్నగారు రాసిన వుత్తరం చదివాను.

ఖాజీపేట వెళ్లి ఓ అమ్మాయిని చూసి వచ్చారట. ఆ పిల్ల అన్నివిధాలా నచ్చిందట. నాకు వీలైనంత త్వరలో ఖాజీపేట వెళ్ళి, ఆ అమ్మాయిని చూసి ఏ విషయం రాయాలట. నచ్చకపోతే వేరే సంబంధాలు చూస్తారట, నచ్చితే సాధ్యమైనంత త్వరలో ముహూర్తాలు పెట్టుకుంటారట!

పెళ్ళి!...పిల్ల!... వెంటనే నా మనసులో రెండు జంటలూ మెదిలాయ్.

రెండవ వుత్తరం తీసుకున్నాను.

రాజుగార్కి —

ఎవరా ఈ వుత్తరం రాస్తోందని మీ రాశ్చర్యపడొచ్చు. నా పేరు మృణాళిని, మాది ఖాజీపేట ...

నాల్గురోజుల క్రితం నన్ను చూసి వెళ్లడాన్కి మీ అమ్మా నాన్నగార్ను వచ్చి వెళ్లారు మీరుకూడా నన్ను చూట్టానికి వస్తారని, మీక్కూడా నచ్చితే వెంటనే లగ్నాలు పెట్టుకుందామని మీ నాన్నగారు మా నాన్నగారో అన్నార్ట. అందుకే నే నీ వుత్తరం రాస్తున్నాను.

నాకు మొదట్నించీ వివాహమంటే కొన్ని అభిప్రాయాలున్నాయ్. అవి మీకు ముందే తెలియజేయడం మంచిదని నా వుద్దేశం. ఎందుకంటే— ఒకవేళ నేను మీకు నచ్చితే మనిద్దరం భార్యాభర్త లవుతాం. అంటే ఒకళ్ళ విషయంలో మరొకళ్ళం అర్ధ భాగస్వాము లవుతాం. రెండర్ధాలు ఒకటవ్వాలంటే రెండూ కలవాలి.

కట్నం తీసుకునే మగవాడంటే నా కసహ్యం. వాళ్ళు ఆడపిల్లల తల్లి దండ్రుల్దగ్గర్నించీ కట్నం పేరుతో డబ్బు గుంజి పీల్చి పిప్పిచేస్తున్నారనికాదు. తనక్కాబోయే భార్యని పోషించడాన్కి సరిపడా డబ్బు ఆమె తల్లిదండ్రుల్దగ్గర్నించీఅడుక్కుంటున్నారని. మీరే చెప్పండి—

నన్ను చూస్తారు. నేను మీకు నచ్చుతాను. కానీ మా నాన్నగారిచ్చే కట్నం నచ్చదు. అప్పుడు వేరే సంబంధం చూసుకుంటారు. అంటే— అక్కడ పెళ్ళికి ముఖ్యం పిల్ల కాదన్నమాట. డబ్బు!

ఒకళ్ల భావాల్తో మరొకళ్ళు ఏకీభవించే వాళ్ళైతేనే ఆ దంపతుల జీవితాలు ఆనందంగా గడిచిపోతాయ్. లేకపోతే పెళ్లైన మర్నాటినుంచే ఎడమొహం, పెడమొహం! ఒకళ్లని చూస్తే మరొకళ్లకి చిటపటలు, పటపటలు! పెళ్లైన తర్వాత ఆ మనిషి ఉన్నతిగాని; పతనంగానీ తమ భాగస్వామి మీదే ఆధారపడి వుంటుంది. అందుకే పెళ్లి చేసుకోబోయే ముందే ఒకరి ఇష్టాలు మరొకరు తెల్సుకుని. రెండోవాళ్లతో ఏకీభవిస్తామనుకున్నప్పుడే ముందుకు పోవాలి... ఈపాటికి నా అభిప్రాయాలు— పెళ్లి విషయంలో — మీ కర్థమయ్యే వుంటాయను కుంటాను. అటువంటి. భర్త లభించినప్పుడు అతనికి మనోవాక్కాయ కర్మలా దాసోహమనడంకన్నా ఆనందం మరొకటి లేదు.

మీరు కట్నం తీసుకోనని, ఎదుటి వ్యక్తిని అర్థం చేసుకొని దాంపత్యం నెరపడాన్కి ప్రయత్నిస్తానని అనుకుంటేనే పెళ్లి చూపులకి రండి. లేకపోతే వద్దు! అనవసరంగా చార్జీలు దండుగ, మాకు లేనిపోని ఆశ!

నన్నర్థం చేసుకుంటారనుకుంటాను...

మృణాళిని.

ఆశ్చర్యంతో చాలాసేపు అలాగే వుండి



పోయాను. ఒక ఆడపిల్ల ఇంత ధైర్యంగా ఇలా రాయగల్గుతుందని ఇంత వరకూ ఊహించలేదు!

ఎంత ధైర్యం—!

చాలా సేపు ఆ ఆశ్చర్యాన్నించీ తేరుకోలేక పోయాను. సిగరెట్టు తర్వాత సిగిరెట్టు వెల్గించి ఆలోచిస్తూ అలాగే వుండి పోయాను.

మృణాళిని వుత్తరం ముందాశ్చర్యాన్ని కల్గించినా' తర్వాతాలోచించిన కొద్దీ ఆమె అంటే ఓ విధమైన ఆకర్షణ కల్గసాగింది.

పెళ్లంటే నాకున్నట్లే ఆమెకీ కొన్ని అభిప్రాయాలున్నాయ్. కాబోయే భర్తగా విషయాలు తెల్సియాలనుకుంది, రాసింది. అంతే! దాంట్లో తప్పు పట్టాల్సిందే కన్పించలేదు.

ఫ్రాంక్‌గా వుండే మనుషులంటే నాకెంతో ఇష్టం. ఆమె వ్యక్తిత్వం నన్నెంతగానో ఆకర్షించింది. వెంటనే వచ్చే ఆదివారం ఖాజీపేట వెళ్తున్నానని, ఆ విషయం వాళ్లకి తెలియజేయమని నాన్నగారికి వుత్తరం రాశాను.

ఆ రాత్రి, సరిగా నిద్రపట్టలేదు.

'వాళ్లిద్దరి' లాగానే నేను, మృణాళిని — ఎంతో అన్యోన్యంగా కాపురం చేస్తున్నట్లు రకరకాల కలలు రాసాగాయి.

ఆదివారం ఎప్పుడొస్తుందా, ఆమె నెప్పుడు చూస్తానా అనే ఆతృత క్షణ క్షణానికి నాలో అధిక మవుతోంది.

ఆదివారం రానే వచ్చింది. మధ్యాహ్నం గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో బయల్దేరాను.

...మరికొద్ది సేపట్లో మృణాళిన్ని చూస్తున్నాను. అంతకుముందే ఆమె అంటే వో అభిప్రాయం కల్గడంతో ఆ ఆలోచనే వో వింత అనుభూతిని కల్గిస్తోంది. ప్రయాణంలో అంతా ఆమె గురించే ఆలోచన్లు!

ఖాజీపేటలో బండి దిగి రిక్షాలో సరాసరి అడ్రసు వెదుక్కుంటూ బయల్దేరాను. ఇంటిని తేలిగ్గానే కనుక్కో గల్గాను.

ఆ ఇంటిముందు వో నడివయస్కుడు నిల్చునున్నాడు. అయనవటువచ్చే వాళ్ళందర్నీ నిశితంగా పరిశీలిస్తున్నాడు. నేను రిక్షా దిగడం గమనించగానే—

"రండి..." గబగబా ముందుకొచ్చాడు.

ఆయన బహుశా మృణాళిని నాన్నగారై వుంటారనుకున్నాను.

"నాపేరు రాజు!" పరిచయం చేసు కొన్నాను.

"నాపేరు నిరంజనం" ఆయన పరిచయం చేసుకొన్నారు తన్ని.

అయితే నా ఊహ కరక్టేనన్నమాట! కాబోయే మామగారు. నమస్కరించాను.

"నమస్కారం! రండి..." ఆయన లోపలికి దారితీశారు. ఆయన వెనకే నేనూ లోపలికి బయల్దేరాను.

ఇంట్లో వాళ్లంతా నాకోసమే ఎదురు చూస్తున్నట్లున్నారు. నన్ను చూడగానే ఎటువాళ్లటు సర్దుకున్నారు.

ఓ పదిహేనేళ్ల కుర్రాడు మాత్రం అక్కడే హాల్లో నుంచున్నాడు.

"వీడు మా పెద్దబ్బాయ్— రవిబాబు! టెన్త్ క్లాస్ చదువుతున్నాడు" అతడ్ని పరిచయం చేసారు నిరంజనంగారు.

"నమస్కారమండీ" వినమ్రంగా నమస్కరించాడతను. ప్రతినమస్కారంచేశాను

హాల్లో కుర్చీలు చాలా నీట్‌గా సర్దున్నాయ్.

## దొంగ రవాణా రాజధాని

75 లక్షలమంది ప్రజలు వున్న బొంబాయి మన దేశంలో దొంగ రవాణాకి రాజధానిగా తయారైంది. దొంగరవాణాకు స్థావరమైన గుజరాత్ నుంచి కేరళ పశ్చిమ తీరానికి బొంబాయి ముఖ్యకేంద్రమైనదని కేంద్రంలోని ఆర్థిక సహాయమంత్రి జనవరి 21వ తేదీన బొంబాయిలో చెప్పారు.

దొంగరవాణాదారులనుండి 5కోట్ల రూపాయల విలువగల ఆస్థిని స్వాధీనం చేసుకోటానికి ప్రభుత్వం ఆజ్ఞలను జారి చేసింది. దీనిలో ఒక్కబొంబాయి లోనే 3కోట్ల ఆస్తివుంది. బొంబాయి శాంతాక్రజ్ విమానాశ్రయంలోజరిగిన ఒక దాడిలో 60 లక్షల రూపాయల విలువగల వజ్రాలు, రెండవ దాడిలో 55 లక్షల విలువగల వజ్రాలు పట్టుబడ్డాయి.

నిరంజనంగారు, నేను కూర్చున్నాం.

రవి మంచినీళ్లు తెచ్చిచ్చాడు.

"మాకు ఒకబ్బాయ్, ఇద్దరమ్మాయిలు. ఇప్పుడీ అమ్మాయి— మృణాళిని పెద్దది. ఇంటర్ పాసయింది. తర్వాత వీడు! చిన్నమ్మాయి మయూరి థర్డ్‌ఫారం చదువుతోంది..." తమ కుటుంబ వివరాలు చెప్పారాయన.

చిన్నగా నవ్వి వూరుకున్నాను.

ఇంతలో లోపలకెళ్లి రెండు టిఫిన్ ప్లేట్లు తీసుకొచ్చి మా కెదురుగా వున్న టీపాయ్‌మీద పెట్టి బయటికెళ్లిపోయాడు రవి.

కబుర్లు చెప్పకుంటూ టిఫిన్ పూర్తి చేశాం.

ఆయనొత్తి కబుర్లు చెప్తున్నావన్నమాటే గాని నా చూపులు మృణాళి నెక్కడైనా కన్పడుతుందేమోనని వెదుకుతూనేవున్నాయ్ టిఫిన్ పూర్తైంతర్వాత కాఫీ కప్పుల్తో ప్రత్యక్షమైంది మృణాళిని!

కొన్ని క్షణాలు ఆమెకేసి అలాగేచూశాను అందగత్తే నా చూపు లామె కిబ్బంది కల్గించినట్లున్నాయ్. తలదించుకొంది. నా ప్రవర్తన నాకే సిగ్గనిపించింది.

"కూర్చోండి..." ఎదురుగావున్న కుర్చీ చూపించాను.

తలవంచుకుని ఆమె అలాగే నిరంజనం గారి పక్కనే నిలబడింది.

"ఫర్వాలేదు కూర్చో అమ్మా..." నిరంజనంగారు కూడా అనడంతో కూర్చుంది.

ఆమె అమాయకత్వంతో కూడిన అందం నన్ను పిచ్చివాడ్ని చేస్తోంది. ఆమెతో మాట్లాడకుండా కూర్చోవడం. నా వల్ల కావడంలేదు.

"మీ పేరు...?" ఏదో ఒకటి ఆమెని పల్కరించాలనే వుద్దేశంతో అడిగాను.

"మృణాళిని"

"మీ రింటరు పాసయ్యారు కదా! ఇంకా పైకి చదవాలను కోవడంలేదా?"

"అది చదువుతాననే అంటోందండి కానీ మా ఆతృత మాది. పెళ్ళైన తర్వాత దానికి చదవా నుంటే, అతనికి చదివించాలనుంటే అప్పుడు చదువుకో వచ్చుగా..." మా మాటల మధ్య అడ్డు వస్తూ అన్నారు నిరంజన్‌గారు.

# కొత్త జీవితం

"నిజమే ననుకోండి..." నసిగాను. ఇంకేమన్నా ?"

గొంతు బాగున్న వాళ్ళందంగా వుండరనే అభిప్రాయం నాకుంది. కానీ మృణాళిని నా అభిప్రాయాన్ని తల్లక్రిందులు చేసింది. ఆమె మాట్లాడుతూంటేనే ఎంతో వినసొంపుగా వుంది. చూస్తుంటే మళ్లీ మళ్లీ చూడాలనిపించే అందం, వింటుంటే మరీ మరీ వినాలనిపించే గొంతు – ఆమెది! తప్పకుండా ఆమెకి సంగీతంలో పరిచయం వుండి తీరాలనిపిస్తోంది – ఆమె గొంతు వింటుంటే ఆ మాటే అడిగేశాను.

మ్యూజిక్ డిప్లొమా పరీక్షలు మొన్నీ మధ్యనే ఇచ్చిందని చెప్పారు నిరంజన్‌గారు. ఇంకా ఏం మాట్లాడాలి? ఆలోచిస్తున్నాను.

"ఇప్పుడే వస్తా మాట్లాడుకుంటూ వుండండి" లోపలి కెళ్ళారు నిరంజనంగారు.

హాల్లో నేను, మృణాళిని!

ఆమెతో ఏమేమో మాట్లాడాలి...ఏదేదో చెప్పాలి... కానీ పెదాలు విడివడ్డంలేదు.

మృణాళిన్ని చూసి నప్పట్నుంచీ నాలో వచ్చిన మార్పుని నిరంజనంగారు గమనించే వుంటారు. బహుశా మా ఇద్దర్నీ కాసేపు వంటరిగా వదలాలనే ఆయన లోపలి కెళ్ళుంటారు, ఆయనొచ్చేలోపే ఆమెతో మాట్లాడేసేయాలి...

"మృణాళినిగారూ..." పిల్చాను.

ఏంటన్నట్లు చూసింది.

"మీరు మరేమీ అనుకోబోతే..."

"అనుకోను చెప్పండి" చిన్నగా నవ్వింది.

ఆమె నవ్వుతూంటే అందం మరింత విజృంభిస్తోంది. ఆమె నా భార్య కాబోతోంది! మనసానందంతో తేలిపోతోంది.

"మరేమీ లేదు మీరు నాకు నచ్చారు ... మీకు నేను నచ్చానో లేదోనని ..." ఏదో మాట్లాడాలనుకున్నాను మరేదో మాట్లాడేస్తున్నాను.

నేనలా అడిగేస్తానని ఆమె వూహించి వుండదు జవాబు చెప్పలేక తికమక పడింది.

తల వంచుకుని కూర్చుంది, ఆమె మొహంలో తృప్తితో కూడిన సిగ్గు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

కాసేపు నిశ్శబ్దం—

టైమ్ గడచిపోతోంది. మళ్లీ నిరంజనంగారు వచ్చేయవచ్చు. అర్జంటుగా మాట్లాడేయాలి...

"మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి."

"చెప్పండి" మళ్లీ నవ్వింది.

"ఇక్కడ కాదు వంటరిగా..." తడబడ్డాను.

"ఇప్పుడు మనం వంటరిగానేఉన్నాంగా"

ఆమె అందం, నడవడి నన్ను పూర్తిగా సంతృప్తుడ్ని చేశాయి. అందుకే అర్జంటుగా కొన్ని విషయా లామెతో మాట్లాడేసేయాలి. ఆతృత పెరిగి పోతోంది.

"కొంచెం సేపట్లో నే నిక్కడ్నుంచీ వెళ్లిపోతాను.ఇక్కడ్నుంచీ సరాసరి స్టేషన్ కెళ్తాను. మీరో అరగంట పోయిం తర్వాత ఇంట్లో ఏదో కారణం చెప్పి అక్కడికొచ్చారంటే మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి" గబగబా అనేశాను.

ఆమె మొహంలో రంగులు మారాయి.

"అమ్మో! నేనాను" తుళ్ళిపడుతూ అందామె.

నాలోనూ త్రొటుపాటు పెరిగింది. "అబ్బే! ఎంతోసేపుకాదు. కొద్దినిముషాలు" త్రొటుపాటును కప్పిపుచ్చుకుంటూ అన్నాను

"ఊహూ! నేనారేను. క్షమించండి. మీరు నన్ను చూట్టానికి వచ్చారు. చూశారు ఏదైనా మాట్లాడాలనుంటే ఇక్కడే మాట్లాడండి. మీరలా రమ్మనడం మాత్రం బాగోలేదు. నా అభిప్రాయాలు మీకు ముందే తెలియజేశాను. మీరే ఆలోచించుకొని నిర్ణయానికి రండి వస్తాను" చటుక్కున లేచి లోపలికెళ్లిపోయింది.

ఆమె అలా మాట్లాడేసరికి సిగ్గేసింది. కుంచించుకుపోయాను. ఇంతలో నిరంజనంగారక్కడికి వచ్చారు. కాసేపాయన్తో మాట్లాడి శలవు తీసుకుని బయల్దేరాను.

* * *

హైద్రాబాద్ చేరుకునే వరకూ దారి పొడుగునా మృణాళిని గురించే ఆలోచన్లు—

హైద్రాబాద్ చేరుకోగానే— ఆ పిల్ల నచ్చిందని ముహూర్తాలు పెట్టుకోమని నాన్నగార్కి రాశాను. నా తర్వాత పెళ్లి చేయాల్సిన ఆడపిల్లల్లేరు, మరితర బాధ్యతలేవీ లేవు కాబట్టి దయచేసి వాళ్ల దగ్గర కట్నం ప్రసక్తి తేవద్దని కూడా రాశాను.

(ఇంకా వుంది)

# రాగమాలిక

## శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

*(గత సంచిక తరువాయి)*

నాలుగు రోజులు గడిచాయి.

రామం రోజూ వచ్చి వెళ్తున్నాడు. రాధ రామంతో ముభావంగా మాట్లాడేది. నవ్వుతున్న ఆ కళ్ళు రామాన్ని చూడగానే కాంతివిహీనంగా అయిపోయేవి. ఈ మార్పు రామం కనిపెట్టాడో లేదో కాని, నేను కనిపెట్టాను.

అది రామం చేతులారా చేసుకున్నదే !

అన్నయ్య వదిన బాబు, మధులతో వచ్చారు. నా సంతోషానికి అంతులేదు.

వదిన్ని ఆ సంతోషంలో కావలించేసుకున్నాను.

''ఉండవమ్మా ! లోపలికి రానిస్తావా ?'' అంది కన్నీళ్లతో నవ్వుతూ వదిన.

అన్నయ్య, వదిన రాధ వైపు వింతగా చూశారు.

''మన రాధ వదినా ! గుర్తుపట్టలేదూ ? రామం భార్య !'' అన్నాను నేను.

''అవునా కాదా అని చూస్తున్నాను.'' అని అన్నయ్య

''రాధా ? ! నేను గుర్తుపట్టలేదుసుమా !'' అని వదిన అన్నారు.

నిజమే. రాధ చాలా మారిపోయింది. చాలా చిక్కిపోయింది. కళ్ళు గుంటలుపడ్డాయి. ఒంటి రంగు బాగా తగ్గింది.

నల్లటి వత్తుజుట్టు ఊడిపోయి, పిలకలాంటి జడ వేళ్లాడుతోంది !

ఇప్పుడు సుధ సాహచర్యంవల్ల కళ్లలోకి కాస్త కాంతి వచ్చింది.

అందంలో రతీదేవిని బోలిన రాధని— ఇప్పుడు అందగత్తె అంటే ఎవర్నూ నమ్మరు. అలంకరణలో శ్రద్ధే లేదు !

''మొన్ననే మొగపిల్లవాడు పుట్టిపోయాడు.'' అన్నాను.

సానుభూతిగా రాధ భుజాన్ని నిమిరింది వదిన.

కేరింతలు కొడుతున్న బాబుని వదిన చేతిలోంచి అందుకుని నేనే రాధ చేతికి అందించాను.

ఏదో పెన్నిధి దొరికినట్టు అపురూపంగా అందుకుంది వాణ్ని — రాధ !

కొత్తవాళ్లని చూసి ఏడిచే బాబిగాడు రాధ దగ్గిర అసలు ఏడవలేదు.

రాధకి బాబుతోడిదే లోకమయిపోయింది.

సుధ, మధు ఆమె వెంటే వున్నారు.

తరవాత వదిన్ని అడిగాను నేను — ''వదినా ! బాబుని రాధ దగ్గిరుంచడం నీకేమన్నా అభ్యంతరమా ?'' అని !

''ఛీ ! ఛీ ! ఏమిటి మంజూ ! నా సంగతి తెలిసీ అట్లా అడుగుతావు ? నాకంటే రాధే బాగా చూసుకుంటోంది వాణ్ని. నేను వెళ్లేదాకా రాధ దగ్గిరే వుండనీ వాణ్ని. నాకూ హాయిగా వుంది !'' అంది వదిన.

రాధ కథంతా విన్న వదిన హృదయం ద్రవించిపోయింది.

''ఏమిటో — ఒక్కొక్క జీవితం ఒక్కొక్క కథ.'' అని నిట్టూర్చింది.

''రాధ జీవితాన్ని బాగుపరుస్తున్నావు. నీ పుణ్యం వూరికే పోదులే ... నీకూ మంచిరోజులు రాబోతున్నాయి !'' అని మధురంగా నవ్వింది వదిన.

నేనేం మాట్లాడలేదు.

* * *

తరవాత రోజే కార్లో తిరుపతి బయల్దేరాం. పిల్లవాడికి పుట్టువెంట్రుకలు యిచ్చి—అన్నప్రాసన చెయ్యాలని వాళ్ళూ బయల్దేరి వచ్చారు.

ఎంతో హాయిగా జరిగిపోయింది ప్రయాణం.

ఒక్కటే లోటు.

పుణ్యక్షేత్రాలకి భార్యాభర్తలిద్దరూ కలిసి వెళ్తే ఎంతో నిండుగా వుంటుంది.

ఆ పుణ్యం ఎందరికుంటుంది? ఆ అదృష్టం నాకు లేదు. రాధా అంతేగా ? రామాన్ని రమ్మంటే వచ్చేవాడే. కానీ రాధకే ఇష్టంలేదు.

పైన కొండమీద చల్లగా — హాయిగా వుంది.

అసలా కొండమీదంతా పవిత్రత వ్యాపించి వుంది. కొండమీద కాలు పెట్టగానే చిత్రమైన అనుభూతికి లోనయింది మనసు.

కాటేజి తీసుకున్నాం.

స్నానాలవీ చేసి గుడి ప్రాంతాలకి వెళ్లాం.

'కళ్యాణ కట్ట'లో బాబుకి - మధుకి కూడా జుట్టు తీయించాము.

అక్కడే వేడినీళ్లు యిస్తే వాళ్లిద్దరికీ నీళ్ళు పోసి కొత్తబట్టలు కట్టాము.

గుళ్ళోకి వచ్చాం.

చక్కెరపొంగలి — స్వామివారి ప్రసాదం కొనుక్కువచ్చాడు అన్నయ్య.

నేను కొత్త ఉంగరము — వెండి గిన్నె కొని తెచ్చాను ముందే !

ఆ ఉంగరంతోనే బాబుకి నోట్లో పాయసం పెట్టాడు అన్నయ్య.

ఆ తరువాత వదిన — నేను — రాధ — సుధ — మధు కూడా పెట్టాం. అక్షింతలు వేశాం. మేము అనుకోకుండానే నలుగురు బ్రాహ్మణులు వచ్చి బాబుని ఆశీర్వదించి అక్షింతలు వేశారు. వాళ్లకి అన్నయ్య దక్షిణ యిచ్చి పంపాడు.

ఆ తరవాత దర్శనానికి బయలుదేరాం.

ఏడు ద్వారాలు దాటి లోపల ప్రవేశిస్తుంటే— నా మనసు ఏవో దివ్యలోకాల్లో విహరించసాగింది. పరవశంతో నా తనువు వణికిపోయింది.

అదొక మాటలకందని అనుభవం !

అవ్యక్తానుభూతి !

ఆ దివ్యమంగళమూర్తి స్వామివారి వెళ్తుంటే శరీరం రోమాంచమయింది. గొంతు గద్గదికమైంది. ఎంత చూసినా తనివితీరదు. ఎంత వర్ణించినా మాటలు చాలవు.

శంఖ చక్రాలతో — తిరుచూర్ణంతో — రత్న కిరీటంతో - హృదయంలో శ్రీదేవి—భూదేవులతో— చిరునవ్వు లొలికిస్తూ నిలిచిన — ఆ కళ్యాణ చక్రవర్తిని - ఆ ఏడుకొండలస్వామిని - చూడడానికి ఎన్ని కళ్లైనా చాలవు. ఆ పాదారవిందాలు

---

***జరిగిన కథ - 8*** నిద్రమాత్రలు వేసుకుంటేగానీ నిద్రపట్టని జీవితం మంజులది. సంవత్సరమంతా అంధకారంలో గడిపే మంజుల జీవితంలోకి వెలుగుని తెస్తారు శలవులకి ఇంటికొచ్చే సుధ, మధులు. కానీ అందులోనూ అసంతృప్తే. కొడుకు వస్తే కూతురో, కూతురువస్తే కొడుకో ఎవరో ఒకరు తండ్రిదగ్గర కెళ్లిపోతారు. ఇద్దరూ ఎప్పుడూ కలిసిరారు. చిన్ననాటి స్నేహితుడు రామం కలసి గుర్తుపడ్తాడు మంజులని. రామం భార్య రాధ. బారసాల చేసుకున్న తర్వాత భార్య సుశీలని తీసుకుని చెల్లెలు మంజుల దగ్గరికి వస్తాడు రాజు. మధు అనారోగ్యం మంజులని మరింతగా కృంగదీస్తుంది. రామంతో పెళ్లి కాకముందు తనకోసారి పెళ్లయిందని రాధ నోట విని ఆశ్చర్య పోతుంది మంజుల. రాధ సంగతంతా తెలిసే పెళ్లి చేసుకున్నానుగానీ ఆమె కోసారి పెళ్ళయిందనే విషయం నన్నామెపట్ల రాక్షసుడిలా ప్రవర్తించేలా చేసేది ... అని మంజులతో చెప్తాడు రామం నీ కడుపులో బిడ్డకి తాను తండ్రి కాదన్న రామం మాటలకి మానసికంగా దెబ్బతిన్న రాధ మృత శిశువుని ప్రసవిస్తుంది. నువ్వూ, నాన్న కలిస్తే చాలా బావుంటుందమ్మా అంటూ ఉత్తరం రాస్తుంది సుధ మంజులకి. అమ్మా నాన్నకీ నీకూ మధ్య అసలేం జరిగింది ? యెందుకు విడిపోయారు అని అడుగుతుంది సెలవులకి యింటికొచ్చిన సుధ తనతో కలసి బతకటానికి విముఖత చూపిన రాధని మంజుల దగ్గర దింపుతాడు రామం.

చూస్తేనే ఎన్ని జన్మల పాపాలో పోతాయి. కళ్లు మూసుకుని — భక్తితో పవిత్రమయిన మనసుతో ఆ వేంకటేశ్వరుణ్ణి పద్మావతీ రమణుని ధ్యానించాను.

''ప్రభూ - మా మనసులకి శాంతి ప్రసాదించు! మా తప్పుల్ని క్షమించు. నా బిడ్డల్ని చల్లగా చూడు! మా కష్టాలు గట్టెక్కించు —'' అంటూ వేడుకున్నాను. మూసుకున్న నా కళ్లకి ఆ స్వామి అభయహస్తం దర్శన మిచ్చింది. ''ధన్యురాల్ని స్వామీ '' అనుకున్నాను. నా కళ్లల్లో నీళ్లు జలజలా రాలాయి.

''వెళ్లండి - వెళ్లండి-'' అంటూ తరిమారు పూజారులు. అవునుమరి — లక్షలాది ' జనం — ఆ క్షణ దర్శనం కోసమే దూరదూరాలనించీ వస్తున్నారు. అందరికీ దర్శనం కావాలిగదా! అందుకే వారు అట్లా తొందర చెయ్యడం!

తీర్థం తీసుకుని ఆ సర్వేశ్వరుడి కింకోమారు మనసారా నమస్కారం చేసుకుని, తృప్తిగా బయటికి వచ్చాము.

నిజానికి ఆ స్వామిని ఎంత చూసినా, ఎన్నిసార్లు చూసినా తృప్తి తీరదు.

ఆ పాదాలమీద మనమూ ఒక పువ్వైతే బావుండుననే భావం ప్రతివారికీ వస్తుందను కుంటాను.

బయటికి వచ్చాక మనసారా ప్రదక్షిణంచేసి నమస్కారం చేసుకున్నాను.

విమాన వేంకటేశ్వరుణ్ణి దర్శించి ఆలయ ప్రాంగణంలోకి వచ్చాము.

కాసేపు కూచున్నాము.

ఆ పరిసరాలు, ఆ ప్రశాంతత చూస్తే ఆజన్మాంతం ఇక్కడే వుందామా అనిపిస్తోంది.

బయట కొబ్బరికాయలుకొట్టి అగరొత్తులు, కర్పూరం వెలిగించాము.

వరాహస్వామి గుడికి కూడా వెళ్లి కాటేజికి చేరాం. భోజనంచేసి కాసేపు విశ్రాంతి తీసుకుని పాపనాశనం, ఆకాశగంగ చూసివచ్చాం.

రాధ తిరుపతి వచ్చాక ఇంకా ఉషారుగ వుంది. పిల్లలతో కలిసి హాయిగా, ఆనందంగా వుంది!

అదే నాకు కావల్సింది!

వస్తుంటే దారిలో సుధ అంది నాతో — ''అమ్మా! నేను దేవుణ్ణేం కోరుకున్నానో చెప్పనా? మా అమ్మనీ, నాన్ననీ కలుపు స్వామీ అని!''

అందరూ ఆశ్చర్యంగా చూశారు.

మధు అన్నాడు ఆ వెంటనే - ''నేనూ దణ్ణం పెట్టుకున్నాను ఏమనంటే మా అమ్మా, నాన్నా ఒక్కచోటే వుండాలీ అని!'' మేమంతా మరింత ఆశ్చర్యపోయాం.

ఇద్దర్నీ దగ్గిరికి తీసుకుని ముద్దు పెట్టుకున్నాను నేను. నా కళ్లు చెమ్మగిల్లాయి.

వదిన అంది ''అవును మంజూ! నువ్వు చెప్తే నమ్మవేమోగానీ నేనూ అట్లాగే ప్రార్థించు కున్నాను

''హూ మంజ సంసారం చక్కబరుచు ఆమెకి సుఖశాంతులు ప్రసాదించు — అని!''

## రాగమాలిక

''వదినా!'' అన్నాను చలించిపోతూ!

ఇంతమంది సహృదయులు నాకోసం ప్రార్థిస్తున్నారు! నాకేం కావాలి?

వాతావరణం తేలిక చెయ్యాలని -- నన్ను నేనే సంబాళించుకుని —

''రాధా! నువ్వేం కోరుకున్నావు?'' అని అడిగాను. రాధ ఏమీ మాట్లాడలేదు. ఒళ్లోని బాబిగాడి తల నిమురుతూ కూచుంది.

''నేను చెప్పనా? ఈ బాబులాంటి కొడుకుని ప్రసాదించమని — అవునా?''

సిగ్గుతో మొహం ఎర్రబడ్డది రాధకి.

''నీకెట్లా తెలిసింది మంజూ!?'' నవ్వింది వదిన.

రాత్రి భోజనం చేశాక రాధ, బాబు, సుధ, మధులు కాటేజిలోనే వుండిపోయారు.

నేను, అన్నయ్య, వదిన ఏకాంతసేవ కెళ్లాం. చాలా చక్కగా కన్నులపండువగా వుంది.

నాలుగు వాకిళ్ల కివతలే ఆపేశారు. అక్కణ్నించే దర్శనం. ఎంతో మహద్భాగ్యం చేసుకుంటేగాని ఆ స్వామి సన్నిధికి రాలేముగదా అనిపించింది.

ఈసారి. ''నా భర్తకు ఆయురారోగ్య సుఖశాంతులు ప్రసాదించు తండ్రీ!'' అని ప్రార్థించుకున్నాను.

ఆయన నన్ను నిర్లక్ష్యం చేసినా ఆయన సుఖంగా నూరేళ్లూ బతకడమే నాకు కావాలి ఆయన చల్లగా వుంటేనే ఈమాత్రంగానైనా పిల్లలు సంతోషంగా వుండగలరు. నేనూ అంత అశాంతిలోనూ కొంత ప్రశాంతత పొందగలను.

ఆ రాత్రి దర్శనానంతరం కాటేజీకి చేరేటప్పటికి రాత్రి పన్నెండయింది.

ఆ వెన్నెట్లో నడుస్తుంటే మనసెంతో హాయిగా — ప్రశాంతంగా వుంది

ఒక గంట పడుకున్నామేమో - మళ్లీ లేచి స్నానాలు చేసి సుప్రభాత దర్శనానికి వెళ్లాం.

గుడి లోపలి తలుపులు తీయకుండానే సుప్రభాత పఠనం చేస్తారు.

సుప్రభాతం సద్బ్రాహ్మణులుచదువుతుంటే- ఎదురుగా వుండి, వింటుంటే, అదో తన్మయత్వం కలుగుతుంది. ఇంకో విచిత్రం ఏమిటంటే —

కొంతమంది ఫారినర్సు - చొక్కా లేకుండా— మెళ్లో జంధ్యంతో — ధోవతీ ఉత్తరీయాలతో — సుప్రభాత దర్శనానికి వచ్చారు.

వాళ్లు హరే కృష్ణ — హరే రామ — గ్రూపు లోనివారుట! వాళ్ల నియమ నిష్ఠలకి ఆశ్చర్యం వేసింది — మాకు. సుప్రభాతం చదివినాక తలుపులు తెరిచారు. దర్శనం ప్రారంభమయింది.

రాత్రి అంతా మల్లెపూలతో అలంకరణ చేశారు స్వామికి. ఎంతో అందంగా వున్నారు స్వామి.

ఇప్పుడు ఆ పూలే వాడిపోయి వున్నాయి. వాడిన పూలలో వున్నా దేదీప్యమానంగా వెలిగి పోతున్నారు స్వామి.

సుప్రభాత దర్శనంలో అదో పవిత్రత వుంది.



స్వామికి ఒక రెండు గంటలు కూడా విశ్రాంతి నివ్వడంలేదు మనం — అనుకున్నాను.

ఏకాంత సేవ పన్నెండు గంటల కయింది.

మళ్లీ రెండూ—రెండున్నరకల్లా సుప్రభాతం! జనం ఎక్కువగా లేరు. ప్రశాంతంగా అయింది దర్శనం — ఆ స్వామి నిజంగా మహిమ గలవాడు. మహితాత్ముడు. ఆ స్వామి సన్నిధిని వదలలేక — వదిలాము.

"రాధ కాపురాన్ని నిలబెట్టు సామీ!" అనుకున్నాను వచ్చేస్తూ, జనం లేకపోయినా అక్కడి పూజారులు తరమడం మానలేదు.

ఇక్కడ ఉద్యోగం చేసేవాళ్లు, ఇక్కడే వుండే వాళ్లు ఎంత అదృష్టవంతులో కదా—అనుకున్నాను.

విమాన వేంకటేశ్వరుణ్ణి చూస్తూ ఆ మెట్ల మీదే కూచున్నాము.

ఏదో మాట్లాడుతున్న అన్నయ్య హఠాత్తుగా "అరె బావ" అంటూ —

"బావా!" అని పిలిచాడు.

దైవ దర్శనం చేసుకుని వెళ్లిపోతున్న ఆ వ్యక్తి వెనక్కి తిరిగిచూశాడు.

సందేహం లేదు ఆయనే!

ఎనిమిదేళ్ల తరవాత యిదే నేనాయన్ని చూడడం! తరవాత ఎన్నిసార్లు అవకాశం వచ్చినా నేనే చూడదల్చుకోలేదు. చూడలేదు.

చిత్రమైన తొట్రుపాటు నాలో!

మేము వున్న వైపుకే తొందరగా నడిచి వస్తున్నారు! నా కక్కణ్ణుంచి పరుగెత్తి పారిపోవాలనిపించింది. కానీ అప్పటికే ఆయన దగ్గిరికి వచ్చేశారు! గుండెన్ని చిక్కబట్టుకుని — తల వంచుకుని కూచున్నాను నేను. నా శరీర కంపనం నాకే తెలుస్తోంది.

"హల్లో రాజా! పిల్లలేరి? అంతా బావున్నారా? ఏమ్మా సుశీలా అందరూ బావున్నారా? బాబేడీ?" ఎంతో ఆదరంగా పలకరిస్తున్నారు అన్నయ్యనీ, వదిన్నీను.

నేను తలెత్తలేదు. కన్నెత్తి చూడలేదు.

ఆయనకు నన్ను పలకరించడం ఇష్టంలేదో, ధైర్యం లేదో లేక నా అయిష్టాన్ని గ్రహించారో నన్ను పలకరించలేదు.

నా మనసు నిరాశ చెందింది.

"సుధ, మధు బావున్నారా రాజా? ఏరీ ఎక్కడున్నారు? పద చూద్దాం. మీరు దర్శనం చేసుకోడం అయిపోయిందా?"

గబగబా అడిగారు.

"ఒక్క పదినిముషాలు ముందు చూసివుంటే అంతా కలసే దర్శనం చేసుకునేవాళ్లం బావా!" అన్నాడు అన్నయ్య.

ఎందుకనో నాకూ అదే అనిపించింది.

పిల్లల్ని చూస్తానంటూ ఆయనా మాతోబాటే కాటేజీకి వచ్చారు.

కాటేజీకి వెళ్తూనే నేను మౌనంగా పక్కమీద పడుకుండిపోయాను.

పిల్లలింకా నిద్రపోతూనే వున్నారు. అయినా అన్నయ్య లేపేశాడు.

వాళ్ల నాన్నని చూస్తూనే మధు ఎగిరి వెళ్లి ఆయన వళ్లో కూచున్నాడు. సుధ లేచి వెళ్లి తండ్రి పక్కన కూచుంది.

ఆ దృశ్యం కన్నులపండువగా వుంది నాకు!

ఆయన ఆత్రంగా ఇద్దర్నీ ఒక్కసారే దగ్గిరికి తీసుకున్నారు.

"ఇప్పుడు వంట్లో బావుందా నీకు నాన్నా!" మధుని అడిగారు పదోసారి.

ఇద్దర్నీ మార్చి మార్చి ముద్దులు పెట్టుకుంటున్నారు. తలలు నిమురుతూ, ఏవేవో అడుగుతూ కళ్లనీళ్లు పెట్టుకుంటున్నారాయన.

సందేహంలేదు — ఆయనకి పిల్లలంటే ప్రాణమే.

"మీకోసమే వచ్చానురా ఈ వూరు!" అంటున్నారు మరోసారి ముద్దాడుతూ!

"బావా! ఆవిడ ఎట్లావున్నారు?" అన్నయ్య అడిగాడు.

"అట్లాగే వుంది రాజా! ఏమీ గుణం కనబడలేదు. మదనపల్లి శానిటోరియంలో చేర్పించాలి. వెళ్లంగానే చేర్పిస్తాను." దిగాలుగా చెప్పారు.

"అవునుమరి! ఆ భార్యంటే ప్రాణమాయె— దిగాలుగావుండక ఇంకెట్లా వుంటారు? ఆ భార్యకి తగ్గాలనే దణ్ణంపెట్టుకుందామనే వచ్చినట్లున్నారు తిరుపతి — పిల్లల్ని ఏదో చెప్పి మభ్యపెడుతున్నారు! అనుకున్నాను నాలో నేనే.

మంచంమీద పడుకునే వాళ్ల మాటల్ని వింటున్నాను. ఆయన కంఠస్వరం వింటుంటే ఎంతో హాయిగా వుంది నాకు!

ఎనిమిదేళ్ల తరవాత వింటున్న ఆయన గొంతు నాకెంతో మధురంగా వినబడుతోంది.

ఆ గొంతు విన్న నేను తలెత్తి చూడకుండా వుండలేకపోయాను.

ఆయన్ని, ఆయన రూపాన్ని చూసిన నేను ఉలిక్కిపడ్డాను.

నిజంగా ఆయనేనా అనిపించింది.

అప్పటికీ — ఇప్పటికీ అసలు పోలికే లేదు.

పొడుగ్గా — బలంగా, తెల్లగా — ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ వుండే ఆయన ఎక్కడ? ఇప్పుడు నేను చూస్తున్న రూపం ఎక్కడ?

చాయ తగ్గింది — చాలా చిక్కిపోయారు. కళ్లల్లో కాంతే లేదు. కళ్లు లోతుకుపోయి దీనంగా వున్నాయి. కంఠంలో గాంభీర్యం మాత్రం అట్లాగే వుంది. నేను తలెత్తి చూసినప్పుడు ఆయన నన్నే చూస్తున్నారు.

నేను తలెత్తేసరికి ఆయన కళ్లు తళుక్కున మెరిశాయి.

దీనంగా నా కళ్లల్లోకి లోతుగా చూశారు నా గుండెల్లో బలమైన బాణం గుచ్చుకున్నట్లయింది. చటుక్కున కళ్లు దించేశాను. అంతే— మళ్లీ చూడలేకపోయానటువైపు.

మరి కాసేపు కూచుని పిల్లల చేతుల్లో ఏవేవో పెట్టి వెళ్లిపోయారాయన.

ఆయన వెళ్తుంటే ఆపాలనిపించింది! వెనక్కి పిలవాలనిపించింది! ఆయనతో మాట్లాడాలనిపించింది! ఏదో ఆత్రుత మనసులో! కాని — ఏదీ చెయ్యలేకపోయాను. కనీసం — పడుకున్నదాన్ని లేవలేకపోయాను. ఆయన నాకు కావాలి. ఆయనకి నేను కావాలి. అనిపిస్తోంది బలంగా నాకే! ఏమిటీ పిచ్చి నాకు? ఆయనకి నేను అక్కరలేదు. ఆయనకి నేను కావాలంటే నాతో మాట్లాడేవారు కాదా? "పడుకున్నావేం? వంట్లో ఎట్లా వుంది?" అని అడిగేవారు కాదా? ఆయన దృష్టిలో నేనొక మనిషిని కాదు.



అసలాయన వచ్చింది ఆయన ప్రియ భార్యామణిగారి ఆరోగ్యం కోసం దేవుణ్ని ప్రార్థించడానికి!

ఎట్లాగో వచ్చారు కాబట్టి పిల్లని చూడ్డానికి వచ్చారు. అదీ మేం కనబడ్డాం కాబట్టి!

కనబడకపోతే ఆయన దారి ఆయనదీ — మా దారి మాదీ అయ్యేది. ఇప్పుడు మాత్రం?

ఆలోచిస్తూ అట్లాగే కళ్లు మూసుకుని పడుకున్నాను. "మంజూ!" అన్నయ్య పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాను

"బావ వస్తే మాట్లాడడానికేమే? పరాయి వ్యక్తితోనే మాట్లాడుతామే మనం? ఆయన ఎంత బాధ పడుతున్నారో తెలుసా?"

చటుక్కున లేచి కూచున్నాను నేను.

"బాధా? ఆయనకా?" పకపకా నవ్వాను —

"నువ్వు ఉత్త పిచ్చివాడివిరా - అన్నయ్యా!" నవ్వుతూనే అన్నాను.

అన్నయ్యకి కోపం వచ్చింది.

"ఆపు నీ పిచ్చిధోరణి!"

"అవునురా — నాది పిచ్చిధోరణే! ఆయన వచ్చింది మన కోసం కాదురా! ఆయన ప్రియురాలి ఆరోగ్యం కోసం "

"కాదు. మన కోసమే. నేను రాశాను. ఆయనకి మనం వస్తున్నామని, డేట్సు గూడా రాశాను అందుకనే వచ్చాడు. నిన్న — ఇవాళ తెగ తిరిగాడుట మనకోసం. ఆయన ఈ కాటేజీకి కూడా వచ్చాడుట. మనం లేము అప్పుడు -"

"అయితే అప్పుడే వెళ్లిపోయారేం?" వ్యంగ్యంగా అడిగాను నేను

"వెళ్లిపోక ఏంచేస్తాడు?" 'మనం' ఆయన్ని అసలు లెక్కచేస్తే కదా?"

వ్యంగ్యంగానే జవాబిచ్చాడు.

"ఎవరు? నేనొక్కదాన్నేకదా — ఆయనతో మాట్లాడంది?"

"మేం మాట్లాడితే చాలదు — ఆయనకి నీ తరవాతే మేమంతా."

"అని మన మనుకుంటున్నాం —"

"మంజూ — వాదనలనవసరం. నీ కాపురం ఎట్లాగైనా చక్కబెట్టాలని నేను శతవిధాల ప్రయత్నిస్తుంటే..."

"అన్నయ్యా — ఒక్కటే మాట — నన్ను లెక్కచెయ్యనివారితో నాకు పనిలేదు - అంతే..."

"మంజూ..." బతిమాలుతూ ఏదో చెప్ప బోయాడు అన్నయ్య.

"ఇంక ఆయన మాటలు నాకు చెప్పద్దురా— కాస్తంత మనశ్శాంతి కోసం వచ్చానిక్కడికి! ఏవో దివ్యలోకాలలో తేలిపోయాను — ఇంతకు ముందు వరకూ! ఆ దివ్యానుభూతిని యింకొంచెంసేపు నన్ను అనుభవించనీ. ఈ పీడకలలు నాకు గుర్తు చెయ్యకు — దయచేసి "

రెండు చేతులూ ముఖాన కప్పుకున్నాను.

అన్నయ్య ఏం మాట్లాడలేదింక. అవతలికెళ్లిపోయాడు.

అసలా రోజే కొండ దిగుదామనుకున్నాము. ఇప్పుడు నాకు దిగాలని లేదు. నేనే వద్దన్నాను.

మరోసారి దైవదర్శనం చేసుకుంటేగానీ - నా మొండి గుండె చల్లబడదు.

మనశ్శాంతి కలగదు.

ఆరోజుకూడా అక్కడే వుండడానికి నిశ్చయించుకున్నాము.

స్నానాదులు కానిచ్చుకుని మళ్లీ గుడికెళ్లాము.

ఈసారి చాలా 'రష్'గా వుంది అక్కడ. 'క్యూ' చాలా పెద్దదిగా వుంది. అయినా మేము క్యూలోనే నుంచుని రెండు మూడు గంటల అనంతరం దర్శనం చేసుకున్నాము. ఆ స్వామి మహిమ ఏమిటోగాని, నాలో వున్న దిగులు, చింత మాయమైపోయాయి. మనసు తేలికపడింది. నిస్స్వార్థంగా నమస్కారం చేసుకున్నాను. ఇప్పుడు నాకు సంతృప్తిగా వుంది.

మధ్యాహ్నం భోంచేసి చాలాసేపు నిద్రపోయాం — అందరంకూడా.

పై మాపు



—ఫొటో : కె. సత్యనారాయణప్రసాద్

సాయంత్రం అట్లా షికారుగా అంతా తిరిగి వచ్చాము

ఎంతో అందంగా పచ్చగావుంది అంతా! రకరకాల పూలచెట్లు, రంగురంగుల కాంతుల్ని వెదజల్లుతున్నాయి. ఎన్నో రకాల క్రోటన్లు రకరకాలుగా 'కట్' చేశారు.

అల్లిబిల్లి తీగలు ఎన్నో — తీగల్లో పూలు ఎన్నో! పేరు తెలీని పూలు. తీగలు ఎన్నో వున్నాయి.

ఇవి ఈ కొండమీద పుట్టి పెరగడానికి ఎంత పుణ్యం చేసుకున్నాయోగదా!

'ఇది నిజంగా భూలోకమా? లేక దేవలోకంలోని నందనోద్యానవనమా?' అనిపిస్తోంది. దీన్ని 'భూతల స్వర్గం' అంటే బావుంటుంది.

కాటేజీలు కూడ రకరకాలుగా వున్నాయి.

ఒకచోటనించి చూస్తే చంద్రగిరి 'వ్యూ' బాగా కనబడుతుంది.

అక్కడక్కడా సిమెంటు బెంచీలు వేశారు. ప్రకృతికాంత సౌందర్యంలోని వింతలు చూస్తుంటే కన్నులపండువగా వుంది.

చల్లటి గాలి. రంగురంగుల పూలు, తరులతాగుల్మాలు చూస్తున్న నేను ఆనందంగా హాయి ననుభవించాను.

ఆ రాత్రి కూడా హాయిగా నిద్రపోయాను.

పొద్దున కొండ దిగి కిందికి వచ్చాము. గోవిందరాజస్వామి గుడి కెళ్లి వచ్చాము.

ఆముక్తమాల్యదలోని 'గోదాదేవి'ని దర్శించుకున్నాము. నిజంగా ఆవిడ ఎంత ధన్యురాలు!

తరవాత అలివేలుమంగాపురం — దానినే 'తిరుచానూరు' అంటారు. అక్కడికి వెళ్లాం.

పద్మవతీదేవిని దర్శించుకుని, కుంకుమార్చన చేయించాము. కొబ్బరికాయ కొట్టాము.

ఆ దేవి కూడా భర్తకి దూరంగా వుంది — నాలాగే. నా బాధ ఆ అమ్మవారు తప్పకుండా అర్థంచేసుకోగలదు. ఆ తల్లి చలవ నాకు తప్పక వుంటుంది. అనిపించింది. ఈ అమ్మవారికోసం ఆ స్వామివారు ఏడుకొండలూ దిగి ప్రతి రాత్రీ వస్తారుట!

నిండుమనస్సుతో నిస్స్వార్థంగా ప్రార్థించాను.

ప్రదక్షిణ, నమస్కారాలుచేసి కొంచెంసేపు కూర్చొని బయటికి వచ్చాము. కుంకుమ, గాజులు కొన్నాము. పుణ్యక్షేత్రాల్లో స్త్రీలు ఇవి తప్పకుండా కొనాలట! వదిన అంది.

పిల్లలు ఏవేవో బొమ్మలు కొనుక్కున్నారు.

మధ్యాహ్నం హోటల్లో భోంచేసి అక్కడే కాసేపు విశ్రాంతి తీసుకున్నాము.

రాధ చాలా ఉత్సాహంగా వుంది. ముగ్గురి పిల్లలతో తనూ ఒక పిల్లలాగా మారిపోయింది.

ఈ వారంరోజుల్లోనే రాధలో మార్పు వచ్చింది. ముఖంలో జీవకళ ఉట్టిపడుతోంది.

ఆ సాయంత్రం పిల్లలు 'సినిమా' అని గోలచేస్తే బయల్దేరాము.

'కలెక్టరు జానకి' సినిమా చూశాము. అదీ నా జీవితంలాగే వుంది.

ఎవరో ఒకరు మరణించడమే పరిష్కార మార్గమా?

మళ్లీ మనసు ఆందోళితమైంది.

ఆ రాత్రి హోటల్లోనే పడుకుని మర్నాడు తెల్లవారుజామునే బయల్దేరాం ఇంటికి.

## 17

మేము వచ్చాక ఒక గంటకి రామం వచ్చాడు. మాతోబాటే భోజనం చేశాడు.

రాధ ఈసారి రామాన్ని చూస్తూనే మొహం ముడుచుకోలేదు. ముభావంగా లేదు.

చిన్నపిల్లలాగ తిరుపతి విశేషాలన్నీ రామంతో చెప్పింది.

రామం చాలా సంతోషించాడు రాధలో వచ్చిన మార్పుకి.

రాధ ఇంట్లో ఊరికే క్షణం కూచోదు. ఏదో ఒక పని చేస్తూనే వుంటుంది.

పిల్లల ముగ్గురి పనీ తనే చేస్తుంది.

అన్నాలు వడ్డన, కంచాలు యెత్తి క్లీన్

వెయ్యడం, ఇల్లు నీట్‌గా అరేంజ్ చెయ్యడం. ఎన్ని పన్లో చేస్తూనే వుంటుంది!

నాకూ వదినకీ అసలు పనేలేదు. హాయిగా కబుర్లాడుకుంటూ కూచోడమే. పిల్లలసలు మా నెపే రావడంలేదు.

ఇప్పుడు రామం రోజుకి రెండుసార్లు వస్తున్నాడు. రాధే రామానికి కాఫీ, టిఫిన్లు యిస్తోంది. నవ్వుతూ మాట్లాడుతోంది. అత్తయ్యగారి గురించి అడుగుతోంది.

రామం ఆమాత్రానికే తృప్తిపడ్డాడు.

నేను, వదిన చాలా సంతోషించాం.

మరో రెండురోజులకి వదిన, అన్నయ్య, బాబు వెళ్ళిపోయారు.

నేను చీరె కొనబోతే వద్దంటే వద్దని అడ్డు పెట్టింది వదిన.

అన్నయ్య కూడా నారించాడు 'మేము పెట్టాలిగాని, తడవతడవకీ నువ్వు పెట్టగూడదు' అంటూ.

రెండు జాకెట్టుగుడ్డలు వదినకీ, బాబికి చొక్కాగుడ్డ పెట్టాను.

వదిన రాధతో "చాలా థాంక్స్ రాధా! ఈ నాలుగయిదురోజులూ వీడితో గోల నాకు తప్పించావు." అంది నవ్వుతూ.

రాధ బాబుని వదలడానికి చాలా బాధపడింది. ఏడిచిందికూడా!

"పిచ్చిపిల్లా — ఏడుపెందుకు? వచ్చే ఏడీపాటికి కొడుకు నెత్తుకుంటావు - ఇది నా ఆశీస్సు—" అంది వదిన రాధ చెక్కిలి మీటుతూ

వెళ్తూ వదిన చెప్పింది చాటుగా నాతో. "మంజూ! నీ మనసుకి కష్టం కలిగించే పనులు మేము కల్లోగూడా చెయ్యం — తిరుపతిలో మీ అన్నయ్య మాటలవల్ల నువ్వు చాలా బాధపడ్డావు. మీ అన్నయ్య తరపున నేను క్షమాపణ అడుగుతున్నాను. మీ అన్నయ్యకి నీమీద ఎంత ప్రేమో నీకు తెలియంది కాదు. నీ జీవితం వ్యర్థమయిపోతోందనే మీ అన్నయ్య బాధ. ఎప్పటికయినా మీ ఆయనా — నువ్వూ—పిల్లలూ ఒకచోట వుంటే — అదే మాకు సంతోషం! దానికోసం ఏం చెయ్యమన్నా చేస్తాం మేము —"

"నాకు తెలుసు వదినా—" అన్నాను కన్నీరు తుడుచుకుంటూ.

అన్నయ్య — వదినల కాళ్ళకి నమస్కారం చేశాను.

ఆశీర్వదించారు.

వాళ్ళు వెళ్ళిపోయినా పిల్లలూ — రాధా వుండడంవలన నాకు లోటు తెలీలేదు.

రాధని కూడా ఒక పిల్లలాగా చూస్తున్నాను నేను.

రెండు వారాలు గడిచాయి.

ఇప్పుడు రామం సాయంత్రాలు ఎక్కువగా యిక్కడే గడుపుతున్నాడు. కానీ రాత్రుళ్ళు వుండమన్నా వుండేవాడు కాదు.

ఒక రోజు రాత్రి —

రామం కాస్త ఆలస్యంగా వచ్చాడు.

రాధ అతడొచ్చేదాకా ద్వారంవంక చూస్తూనే వుంది.

అతడు వచ్చాక ఆమె ముఖం విప్పారింది.

నాలో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది! నా ఆలోచనకు దోహదమిస్తూ ఆకాశంలో గూడా— మెరుపులు మెరవడం ప్రారంభించాయి.

ఉరుములు వాటికి తోడయ్యాయి. అంతా చీకటిమయమయిపోయింది. వర్షం ప్రారంభమయింది. అది కుండపోతయింది. తగ్గే సూచనే కనబడలేదు.

భోజనాలయ్యాయి. రాధ పిల్లలతో ఆడుతూ కూచుంది. నేను - రామం కబుర్లు చెప్పుకుంటున్నాము.

కొంతసేపటికి పిల్లలు నిద్ర వస్తోందంటూ లేచివెళ్ళారు. వాళ్ళతోటే రాధా వెళ్ళింది.

టైము తొమ్మిదయింది.

వర్షం అంతకంతకూ ఎక్కువయింది.

అరగంటయ్యాక —

"పిల్లలు నిద్రపోయారా — రాధా?" అడిగాను నేను.

"అవునక్కా — నిద్రపోయారు" అంది రాధ.

"అయితే నువ్వూరా. వర్షంలో వేడి వేడి కాఫీ తాగుతూ కబుర్లు చెప్పుకుందాం." అన్నాను.

వంటావిణ్ని లేపడం ఎందుకని తనే వెళ్లి కాఫీ పెట్టి కప్పుల్లో పోసి తీసుకువచ్చింది రాధ.

"లోపల కూచుందాం. ఇక్కడ చలిగా వుంది!" అంటూ మా బెడ్‌రూమ్‌లోకి దారితీశాను.

ముగ్గురం కాఫీ తాగుతూ కబుర్లు చెప్పుకున్నాం చాలాసేపు!

టైము పదిన్నర దాటింది,

రామం వెళ్తానంటూ లేవబోయాడు.

"రామం! ఇంకేం ఇంటికెళ్తావు? ఈపూటకి యిక్కడే పడుకో — ఇదేం పరాయి యిల్లు కాదుగా?" అన్నాను నేను — రామాన్ని ఆపుతూ

రామం ఇబ్బందిగా ఫీలయ్యాడు.

"వర్షంకూడాను అందులో."

రాధేం మాట్లాడలేదు.

"ఏం రామం! నీకేమిటి అభ్యంతరం? ఎప్పుడు పడుకోమన్నా వినిపించుకోవు?" సూటిగా అడిగాను.

"అబ్బెబ్బె ... అభ్యంతరం ఏముందిగానీ..."

"కానిలేదు. ఏమీలేదు. ఈపూట వర్షంలో నువ్వు యింటికి వెళ్లడానికి వీల్లేదు."

"సరే ... నీ యిష్టం."

నాకోసం అంగీకరించినట్లుగా తిరిగి కుర్చీలో కూచున్నాడు. కానీ మొహంలో ఆనందం నేను కనిపెట్టకపోలేదు.

'పాపం!' జాలేసింది నాకు.

[ఇంకా వుంది]

### బ్లడ్ వెడ్డింగ్

(మొరాకో ... 90 ని.లు.) 'బోడస్ డే సాంగ్రే' అనే ఫెడెరికో గార్సియా లోర్కా నాటకం ఆధారంగా తయారైన చిత్రం. ఒక యువకుడు, ఒక యువతిని ప్రేమిస్తాడు. కాని, ఇరుకుటుంబాల వైరం మూలంగా ఆమెను వివాహమాడలేక పోతాడు. అతనికి వేరే యువతితో వివాహమవుతుంది. ఐతే, తన ప్రియురాలికి పెళ్లి జరిగే సాయంత్రం ఆమెను కలుసుకొని, తనతో లేచి వచ్చేయమని ఒత్తిడి చేస్తాడు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుని ప్రయోజనంలేదని యిద్దరికీ తెలుసు. మొరాకో సుందర ప్రకృతి, శ్రవణానందకరమైన సంగీతం తప్ప చెప్పుకోదగ్గ యితర అంశాలేవీ లేవు కథ మందకొడిగా సాగుతుంది.

### ది డ్రీమ్ ఆఫ్ అమెరికా

(స్వీడన్ ... 95 ని.లు.) స్వీడన్‌లో ఉరిశిక్షకు స్వస్తిచెప్పడానికి ముందు 1876 లో ప్రజల సమక్షంలో తలలు తీసివేయబడ్డ యిద్దరు మాజీ నేరస్థుల యధార్థ గాథ. పొలహక్కులు కోల్పోయినందున గత్యంతరంలేక డబ్బు దోచుకొని, అమెరికాకు వెళ్లి అక్కడ నవజీవనం ప్రారంభించాలనుకున్న ఆ యిద్దరు పాత నేరస్థులు చిన్న దొంగతనాలనించి దోపిడీ వరకు పూనుకుంటారు. వీరి ప్రయత్నం ఒకచోట భగ్నమవడమేకాక హత్యానేరం కూడా మీద పడడంతో నిరంతరం పోలీసులకు పట్టుబడకుండా తప్పించుకోవడంతప్ప మరో మార్గం లేకపోతుంది. కథ నడిపిన తీరు ఉత్తమంగా వుంది.

### ఓమర్ గట్లటో

(అల్జీరియా ... 100 ని.లు.) ఒక పేద కుటుంబం ఒక అవివాహితుని సంపాదనమీద ఆధారపడి వుంది అతనికి హిందీ ఫిల్ములన్నా, సంగీతమన్నా చాలా యిష్టం. ఒక యువతి కంఠాన్ని టేప్‌లో విని ఆకర్షితుడై, ఆమెను కలుసుకోబోయేంతలో కథ అనూహ్యమైన మలుపు తిరుగుతుంది. హీరో అద్భుతంగా నటించాడు. దర్శకుని ప్రతిభ ఆద్యంతం కనిపిస్తుంది. అల్జీరియాలోని మధ్యతరగతి ప్రజల జీవన విధానాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించడంలో దర్శకుడు కృతకృత్యుడయ్యాడు.

### కామ్ రేన్స్ త్రూ అవుట్ ది లాండ్

(ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ...105ని.) అత్యవసర పరిస్థితి ముసుగున ప్రజల హక్కులను అణగద్రొక్కడానికి ఒక నగరంలో మిలటరీ అధికారుల నిరంకుశత్వం గుండెలు పిండేలా చిత్రీకరించబడింది. రాజకీయ ఖైదీలను కారాగారంలో చిత్రహింసల పాలు చేశారని తెలిసిన ప్రజలు వీరావేశంతో తిరుగుబాటుకు పూనుకుంటారు. కాని ప్రజా సమూహంపై అధికారుల నిరంకుశత్వం ఏనాటికీ పైచేయి కాజాలదని నిరూపించే ఈ చిత్రం నిడివి మరికొంత తగ్గి వుంటే ఇంకా రసవత్తరంగా ఉండేదేమో. అక్కడ వినిపించిన సంగీతం ఆహ్లాదకరంగా ఉంది. అందరి పాత్రపోషణ చక్కగా ఉంది.



'కేన్నిబాల్స్'లో ఒక దృశ్యం



'కామఫ్లాజ్'లో ఒక దృశ్యం

# ఫిల్మోత్సవ్ - '78 చిత్ర కథలు

*(గత సంచిక తరువాయి)*

### బౌండ్ ఫర్ గ్లోరి

(యు. ఎస్. ఏ... 150 ని. లు.) ఏమీ లేకపోయినా ఏదో ఒక విధంగా జీవితం గడపాలను కునే నిరాశా జీవుల పట్ల సానుభూతితో వెయ్యి గీతాలకు పైగా రచించిన ఒక జానపద గాయకుని జీవిత చిత్రణ. 1930 నాటి సంయుక్తరాష్ట్రాల లోని దళిత వర్గాల స్థితిగతులను తెలిపే ఈ చిత్రంలో హీరో క్లిష్టమైన పాత్రను అసమాన - చాతుర్యంతో పోషించాడు. సంగీతం ప్రధానాకర్షణ. జ్యోతిష్కుడుగా, చిత్రకారుడుగా ఉన్న ఊరిలో కుటుంబాన్ని పోషించలేని హీరో తన గానంచే ప్రజలను ఉత్తేజితులను చేయగలననే నమ్మకంతో కాలిఫోర్నియాకు వెళ్తాడు. అక్కడి రేడియో కేంద్రంవారికి ఇతని గీతాలలోని వేదాంతంనచ్చదు. అంచేత ఆ ఉద్యోగాన్ని కాలదన్నుకొని స్వేచ్ఛా గాయకుడుగానే పర్యటిస్తుంటాడు.

### టెంట్ ఆఫ్ మిరకిల్స్

(బ్రెజిల్... 125 ని. లు.) 1,900 ప్రాంతంలోనే వైరితలు వేస్తున్న నవనాగరికతను ఖండిస్తూ, ఆఫ్రికన్ల ప్రాచీన సంస్కృతిని ప్రబోధించిన ఒక వేదాంతి గాథ. రాజకీయ విష యాలపై సుదీర్ఘ సంభాషణలు, విపరీతమైన నృత్యాలు, వర్ణ విభేదాలను చిత్రించే ఈ కథా గమనానికి అడ్డు తగులుతాయి.

### వాక్మింగ్ అప్

(జపాన్... 120 ని. లు) మతి స్థిమితం లేని ఓ యువతితో వలువురికి సంబంధం ఉంటుంది. బిడ్డను ప్రసవించాక ఆమె మామూలు స్థితికి వస్తుంది. ఐతే, ఆ బిడ్డకు తండ్రి ఎవరన్న సమస్య తల ఎత్తుంది. శృంగార సన్ని వేశాలు పుష్కలంగా ఉన్నాయి.

### రాంగ్ మూవ్‌మెంట్

(ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మని...95 ని.లు) నిస్సారమైన జీవితం పట్ల విరక్తి చెంది పర్యటన వల్ల రచయిత కాగలననే నమ్మకంతో వున్న ఓ యువకుడు, ఒక వీధిగాయకుడు, ఒక మూగపిల్ల, ఓ నటి, ఒక కవి — తమకు ఆశ్రయ మిచ్చిన ఒక పారిశ్రామికవేత్త భవనంలో ఒక రాత్రి వుంటారు. ఆ పారిశ్రామికవేత్త ఆత్మహత్య చేసుకోవడంతో కవి జారుకుంటాడు. నటి ఇటలీకి వెళ్లిపోతుంది. ఇలా అందరూ తలో దారి అయ్యాక ఒంటరిగాడైన యువకుడు తన రచనకు ఉపక్రమించడానికి ఇదే అదనుగా భావిస్తాడు. రచనా వ్యాసంగం అతనికి మానసిక తృప్తి నిస్తుంది. "ఏ వ్యక్తీ ఏకాకి కాదు. ఒంటరి తనమన్నది అంతర్గతంగా సృష్టించుకునే కృత్రిమమైన అనుభూతి" అని గుర్తిస్తాడు. తాబేలు నడకతో చిత్రం ప్రేక్షకుల సహనాన్ని పరీక్షిస్తుంది.

### వాయేజీ ఆఫ్ ది డేమ్డ్

(యు. కె. ... 150 ని.లు) యదార్థ గాథ. 1939 మే 19న 937 మంది జర్మన్ జాయిష్ కాందిశీకులు తమ స్వస్థలం వదలి ఒక నౌకపై వెళ్లడానికి అనుమతింపబడతారు. క్యూబాలో వాళ్ళకు ఆశ్రయం లభిస్తుందని ఆశపడతారు. కాని, క్యూబన్ — జర్మన్ ప్రభుత్వాల కుమ్మక్కు వల్ల ఆ కాందిశీకులు హవానాలో దిగడానికి అనుమతింపబడలేదు సరికదా — జర్మనీకి తిరిగి వెళ్లడానికీ వీలుకాదు. దిక్కుతోచని ఆ కాందిశీకుల మనోవేదన కఠిన శిలలను సైతం కరిగింప జేస్తుంది. చివరికి ఇరు ప్రభుత్వాలూ జూన్ 27న ఆంట్‌వెర్ప్‌లో వారు దిగడానికి వీలు కలిగించే వరకు సతమతమైపోతారు. ప్రతిభావంతమైన దర్శకత్వం.

**జి. వి. జి.**

### కేడ్డి

(ఆస్ట్రేలియా...107 ని.లు) భర్త పెట్టే బాధలు భరించలేక వేరైపోయిన కేడ్డి తన ఇద్దరు పిల్లలను పెంచి పెద్ద చేయడానికి 1920–1930 మధ్య పడే యాతనలు చూస్తుంటే ఆస్ట్రేలియాలో కూడా అటువంటి అభాగినులు ఉన్నారా అనిపించక తప్పదు. ఈ వాస్తవ గాథా చిత్రంలో కేడ్డిగా హెలెన్‌మోర్స్ మహోన్నతంగా నటించింది. 1976 శాన్ సబాస్టియన్ చలన చిత్రోత్సవాలలో ఆమెకు అవార్డు కూడా వచ్చింది. పీటర్ అనే ధనికుడు ఆమె జీవితంలో ప్రవేశించ బోయేటప్పుడు — అతనికి యిదివరకే వివాహ మైందని తెలుసుకొని ఆమె చూపే హావభావాలు ప్రేక్షకుల హృదయాలపై చెరగని ముద్ర వేస్తాయి.

### ది అసైన్‌మెంట్

(స్వీడన్ – 100 ని.లు.) దేశంలో సైనిక పాలనలో చెలరేగిన ప్రజా అలజడి మధ్యవర్తిత్వం మూలంగా ఎంతవరకు నివారింపబడడానికి వీలవుతుంది? లాటిన్ అమెరికన్ దేశంలోని ఉభయవర్గాలూ తమ మధ్య సామరస్యం కుదర్చ డానికి ఒక స్వీడన్ రాజకీయవేత్తను ఆహ్వానిస్తాయి. ఆయన పరిష్కరించడానికి పూనుకునేకొద్దీ కొత్త కొత్త సమస్యలు ఉత్పన్నమౌతాయి. చివరికి బలహీనవర్గాలవారిపై మిలిటరీ పోలీసులు కలిసి చేసే కుతంత్రాలకు ఆటవస్తువుగా వుపయోగింప బడడంతో అతని ప్రాణానికే ముప్పు సంభవించే పరిస్థితులు ఏర్పడతాయి. చక్కని స్క్రిప్టు. ఇది సెటైర్ అనడంకన్నా చక్కని థ్రిల్లర్‌గా పేర్కొనవచ్చు.

### మారికో — మదర్

(జపాన్ ... 95 ని.లు.) నరాల బలహీనత వల్ల వాక్కు కోల్పోయిన ఒక బాలునిచేత పలికించ డానికి మారికో పడ్డ శ్రమ హృదయాలను ద్రవింప చేస్తుంది. అంగవైకల్యం గల బాలలకు 'సిల్క్‌ట్రీ హోమ్'లో ఒకవంక సేవ చేస్తూ, మరోవంక

# ఫిల్మోత్సవ్



'రాధా మాధవి' లో దీప.

నటిగా ధనమార్జించే మారికోమియాన్ అనే నటీమణే ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం, సంగీతం — అన్ని బాధ్యతలు వహిస్తూ నిర్మించింది. ప్రధాన పాత్రధారిణీకూడా. కొన్ని పాటలు పాడింది. శ్రావ్యమైన కంఠస్వరం. ఛాయాగ్రహణం ఈ చిత్రానికి మరింత జీవం పోసింది.

**సొన్యా అండ్ ది మేడ్‌మేన్**

(ఈజిప్ట్ – 130 ని.లు.) అభ్యుదయ భావాలు, మహోన్నతమైన ఆదర్శాలు గల మేధావులు తోటి మానవాళిని రక్షించడానికి నేరం చేయవలసివచ్చినా శిక్షార్హులుగా పరిగణింపకూడదనే సిద్ధాంతం చాటే ఒక నిరుద్యోగియైన యువకుడు— వ్యభిచార వృత్తికి దిగిన ఒక అందమైన అభాగ్యురాలిని ఉద్ధరించడానికని ఆమెకు అప్పు యిచ్చిన ఓ వృద్ధ స్త్రీని హత్య చేస్తాడు. ఆ తర్వాత అతను ఎదుర్కొన్న చిక్కులు రసవత్తరంగా చిత్రీకరింపబడ్డాయి. హీరో మహోన్నతమైన నటనను ప్రదర్శించాడు. ఇబ్రహీం సేలే కెమెరా చాలావరకు కథను నడిపిస్తుంది.

**ఎఫ్ ఫర్ ఫేక్**

(ఫ్రాన్స్, ఇరాన్, ఎఫ్. ఆర్. జి–90 ని.లు.) కృతకమైనది కళ. కళ అనేది యథార్థం కానక్కరలేదు. సహజాన్ని అసహజంగా చూపే సృజనాత్మకమైన కళ నించి కృతకమైన కళను వేరు చేయడానికి సాధ్యంకాదని చెప్పడానికి కలగాపులగంగా సాగిన చిత్రీకరణ.

**మేన్లీ టైమ్స్**

(బల్గేరియా – 190 ని.లు.) తనకు నచ్చిన యువతిని ఏ యువకుడైనా దక్కించుకోవచ్చనే హక్కులు గల కాలంనాటిదీ ఇతివృత్తం. ఒక అందమైన యువతిని ఆమె మనసివ్వని ఓ యువకుడు చేపట్టబోతే ఆమె తప్పించుకోడానికి మరో యువకుని దరి చేరి, తనను దక్కించుకోమని అతన్నే కోరుకుంటుంది. ఆ యువతికోసం పోరాడిన ఆ యువకుడు చివరికి హతమార్చబడతాడు. ఎక్కువ సంభాషణలు లేకపోవడంతప్ప చెప్పకోదగ్గ అంశాలేవీ ఈ చిత్రంలో లేవు. బల్గేరియాలో ఆ ప్రాచీనకాలంలో బుద్ధిబలంకన్నా బాహుబలమే గొప్ప—అని తెలియజేస్తుంది చిత్రం.

**ఎ కాటేజ్ నియర్ ది వుడ్స్**

( జెకొస్లొవేకియా – 100 ని.లు. ) ఆశ అనేది అంతిమ సమయంలో కూడా విడనాడదు. నగర వాతావరణానికి దూరంగా ప్రశాంతంగా గడపాలనుకునే ఒక కుటుంబానికి సెలవులో జాల్లో ఒక వృద్ధుడు తన భవనంలో ఒక భాగం ఆశ్రయానికి యిస్తాడు. ఆ యింటిని సర్దిచక్కబెడతారా కుటుంబ సభ్యులు. ఆ యింటిని తమకు అమ్ముతాడని ఆశపడతారుకూడా. ఈలోగా వృద్ధునికి జబ్బు చేస్తుంది. ఆస్పత్రిలో చేరుతాడు. ఇల్లు అమ్మకానికి పత్రాలు తయారు చేయమంటాడుకూడా. కాని, తన యింట్లోనే ప్రశాంతంగా కన్ను మూయాలనీ, అక్కడికే తనను తీసుకెళ్ళమనీ తన అంతిమ కోర్కెను వెలిబుచ్చుతాడు. ఆశయానికి, ఆశకు కొత్త నిర్వచనమిచ్చే ఈ చిత్రంలో సున్నితమైన హాస్యం అంతర్భాగంగా వుంది.

**మెటుమార్ఫసిస్**

(స్వీడన్ 90 ని.లు.) ప్రేగ్‌లో 1900 ప్రాంతంలో జరిగినట్లు చెప్పబడిన అభూతకల్పన. ఒక కుటుంబానికి జీవనాధారమైన అవివాహితుడైన ఒక సేల్స్‌మన్ నిస్పృహ చెంది, అనూహ్యంగా ఒక కీటకంగా మారిపోతాడు. దాంతో తన తల్లిదండ్రులకు, చెల్లెలికే జుగుప్సాకరంగా తయారౌతాడు. అతను చనిపోగానే ఆ కుటుంబంలోని వారు అతన్ని తీసి అవతల పారేస్తారు. పనికిరానప్పుడు పురుగుకన్నా హీనంగా చూస్తారని చెప్పే ఈ చిత్రంలో ఛాయాగ్రాహకుని పనితనం అద్భుతం. కీటకం దృష్టిలో ఇతర పాత్రధారులను చూపించడానికి కెమెరా చాలావరకు గ్రవుండ్ లెవెల్‌నించే చిత్రీకరిస్తుంది.





'విచిత్ర జీవితం'

**ఏన్ ఆవరేజ్ లిటిల్ మేన్**

(ఇటలీ – 125 ని.లు). రిటైర్ కాబోయే ఓ ప్రభుత్వోద్యోగి తన ఉన్నతాధికారులను ఎలాగో ఒప్పించి, తన ఒక్కగాని కొడుకు ఉద్యోగానికి ప్రయత్నిస్తాడు. తీరా ప్రభుత్వ పరీక్షల రోజున ఆ కొడుకు ఒకచోట బాంక్ దోపిడీ జరిగినప్పుడు ప్రేల్చబడిన తుపాకీ తూటాకు గురి అయి, చనిపోతాడు. అతని తల్లి ఆ షాక్‌కు అవిటిదైపోతుంది. తండ్రి రగిలే పగతో ఒకచోట తన కొడుకు హత్యకు కారకుడైన వ్యక్తిని పట్టుకొని, తన కసి తీర్చుకోడానికి హింసిస్తాడు. ఆ యువకుడు పడే బాధలో గతించిన తన కొడుకును తలచుకొని విశ్రృంఖలుడైపోతాడు. స్క్రీన్‌ప్లే, పాత్రధారులందరి నటన ఆకట్టుకుంటాయి. ఆగ్రహావేశాలను నిగ్రహించుకోలేకపోతే మామూలు మనిషి కూడా హత్యకు పూనుకునే వరకు పరిస్థితులు ఎలా ప్రేరేపిస్తాయో ఈచిత్రంలో చక్కగాచిత్రీకరించబడింది.

**నికెలోడియన్**

(యు. ఎస్. ఎ–120 ని.లు). సంయుక్త రాష్ట్రాలలో చలన చిత్ర నిర్మాణ తొలి దశ. కొత్తగా సినిమా రంగంలో ప్రవేశించేవారితో పాత నిర్మాతల పోటీ. ఒక లాయరు అనుకోకుండా బర్ట్ రేనాల్డ్స్ అనే అతనితో కలిసి చిత్ర నిర్మాణంలోకి దిగుతాడు. కొన్ని కారణాలవల్ల ఇద్దరూ విడిపోతారు. ఆ లాయరుతో రేనాల్డ్స్ భార్యకు సంబంధముంటుంది. దాంతో కథ మరో గాడిలో పడుతుంది. మితిమించని శృంగార సన్నివేశాలు, ముష్టియుద్ధాలు, చిత్ర నిర్మాణంలో స్లాప్‌స్టిక్ కామెడీ రంజింపజేస్తాయి.

[30వ పేజీ చూడండి]



''లో ఒక దృశ్యం

*మాణిక్యం మాణిక్యమే*

దర్శక శాఖలో రెండున్నర దశాబ్దాల మంచి ప్రాధాన్యత గల స్థాయిని మెయిన్‌టెయిన్ చెయ్యడం, అందరికీ అయ్యేదికాదు.

శ్రీ వి. మధుసూదనరావు చిత్రీకరించిన చిత్రాలలో ఎనభై శాతం విజయాన్ని సాధించాయి ముఖ్యంగా అక్కినేని... విక్టరీ కలయికలో వచ్చిన చిత్రాలన్నీ (రాజారమేష్, కన్నకొడుకు తప్ప) బాక్సాఫీస్ విజయాన్ని సాధించిన నిజాన్ని ఎవరూ కాదనలేరు.

మాణిక్యం మాణిక్యంగానే ప్రకాశిస్తుంది. రాబోయే రెండు చిత్రాలు ''విచిత్ర జీవితం... మల్లెపూవు'' విక్టరీకి విజయాన్ని తెచ్చేవిగా యిక్కడివాళ్ళ అభిప్రాయ పడుతున్నారు.

***అక్కినేనికి, కృష్ణకు మంచి ప్రారంభం!***

ఈ సంవత్సరం శ్రీ అక్కినేనికి, కృష్ణగారికి ఆనంద వత్సరంగా వుండగలదని ప్రారంభ వేళలో విడుదలయిన ''ఛిలిపి కృష్ణుడు... ఇంద్రధనుస్సు'' చిత్రాలు నిరూపించాయి

సురేష్ ప్రొడక్షన్స్ నిర్మించిన ''చిలిపి కృష్ణుడు'' విడుదలయిన రోజునుంచి యీనాటి సంచిక పాఠకులను అలరించే రోజు వరకు కూడా ''హౌస్



'మంచి బాబాయ్'లో హిమబిందు, మోహన్‌బాబు

ఫుల్''గా నడవడం, ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన ''ఇంద్రధనుస్సు'' విడుదలయిన రోజు నుంచి ప్రేక్షకులు మెచ్చిన చిత్రం గావడం... నేనిచ్చిన ''గుడ్ స్టార్స్''కు ప్రత్యక్ష నిదర్శనం కాదా, మరి.

# తెలుగు చిత్ర రంగానికి రానున్న అశుభం

1977లో విడుదలయిన 70 చిత్రాలలో, 18 చిత్రాలకు మాత్రమే డబ్బు లొచ్చాయి. అంటే...25.7 శాతం విజయాన్ని చవిచూచాయి అన్న మాట. కొన్ని భారీ చిత్రాల ఫలితాలు... నిర్మాతలను మళ్లీ మరో రెండు సంవత్సరాల వరకు సినిమా నిర్మాణానికి ''గుడ్‌బై'' అనే స్థితికి దారి తీసింది. కొన్ని చిత్రాలు అనూహ్య విజయాన్ని సాధించి కొత్తవాళ్లలో మోజు పెంచి... మరింత పెట్టుబడిని పెట్టించడానికి దారి తీశాయి.

ఇప్పుడున్న యీ కలుషిత అవాంఛనీయమైన పరిశ్రమ ధోరణికి స్థిరపడిన పాత నిర్మాతలు అనుకూలతను ప్రదర్శించడానికి విముఖంగా వున్నారు.

నిర్మాణ వ్యయం 1972కి, 1978కి పోల్చి చూస్తే... కొన్ని లక్షల తేడా కనిపిస్తుంది. చిత్రాల విజయం ఆయా నిర్మాతల ''నుడి''పై ఆధారపడివున్నదేగాని... మంచి కథాబలంపై కాదు అని నిర్ధారణ అయ్యింది.

*పారితోషికాల విజృంభణ*

ఆర్టిస్టులు వారి పారితోషికాన్ని ప్రతి చిత్రానికి కొన్ని వేలు పెంచేస్తున్నారు. ఎందుకు పెంచుతున్నారండీ అని అడిగితే... వాళ్లు ''ఆఫర్'' చేస్తే వద్దనమంటారా అని ఎదురు ప్రశ్న వేస్తున్నారు.



మన రంగంలో మరో ''జబ్బు'' వ్యాపించింది. [ఏ చిత్రం విడుదలయినా, దానిని కించపరచడం... లేదా అబద్ధపు ప్రచారాలు సాగించడం.]

మదరాసులో చిత్రాలు ''ప్రివ్యూ''లు ప్రదర్శించడంవల్ల ఏర్పడే ''జబ్బు'' పైన పేర్కొన్నది. రాబోయే రోజులలో చిత్ర రంగానికి శుభం జరిగేది అసంభవం అనిపిస్తుంది.

గీతా కంబైన్స్ చిత్రంలో కమల్‌హాసన్, రజనీకాంత్



*మున్ముందు ముద్దు అవసరమే*

కత్తెర శాఖ సినిమావాళ్లకు ''ముద్దు'' అవాంఛనీయము కాదు అని సూచించే విధంగా పర్మిషన్ యిచ్చారు.

సన్నివేశానికి ''ముద్దు'' అవసరము అనిపిస్తే... ఆ ''క్రియ''ను కత్తెర ముట్టుకోదు అనేది అభిప్రాయాన్ని మన దర్శక ... నిర్మాతలు రాబోయే చిత్రాలలో ఎక్స్‌ప్లాయిట్ చెయ్యడానికి వెనుకాడరు.

కథ వ్రాస్తున్నప్పుడే, ''ముద్దు'' అవసరము అనిపించే దృశ్యాలను క్రియేట్ చెయ్యగల సమర్థులు కదా, మనవాళ్లు.

ప్రేక్షకుడు తను అభిమానించే కథానాయకుడు ... నాయికను బహిరంగంగా ''ముద్దు'' పెట్టుకుంటే...మరిన్నిసార్లు చిత్రానికి వస్తాడేమో అనేది నమ్మకం మనవాళ్లకు ఎక్కువ అవుతుందేమో, మరి.

*నిరసన నిషేధం*

ప్రస్తుతం వస్తున్న చిత్రాలలోనే కథాబలం సన్నగిల్లి...నాయకీ నాయకుల విచ్చలవిడి శృంగారం వెర్రితలలు వేస్తూ వుండడాన్ని కొందరు అసహ్యించుకుంటున్నారు.

''ముద్దు'' వచ్చిందో, సంసార స్త్రీలు, చదువుకున్న సంస్కారవంతులు చిత్రాలను నిషేధించడానికి, నిరసించడానికి భయపడరు.

తెరపై ''ముద్దు'' ఎలాంటి సమస్యకు దారితీస్తుందో, చూడాలి మరి.



'బాలనాగమ్మ'లో జయమాలిని, సత్యనారాయణ

# సినిమా

## మరో 15 సంవత్సరాలు అగ్రశ్రేణి నాయకుణ్ని : శోభన్ బాబు

ఈ ఏడు "నాయుడుబావ" చిత్రంతో శోభన్‌బాబుగారి నట జీవితం ప్రారంభమైంది. ఆ చిత్రం విడుదలయిన పదునాలుగవ రోజున "నిండుమనిషి" చిత్రం వచ్చింది.

"నిండుమనిషి" విడుదల సందర్భంగా విజయవాడ "మనోరమ"లో పూర్ణా పిక్చర్స్ శ్రీ రాజాజీ ... శ్రీ విశ్వనాథ్ పత్రికా సమావేశాన్ని ఏర్పాటు చేశారు.

ఆ సభకు అధ్యక్షత వహించిన శ్రీ రెంటాల తొలి ప్రసంగకుడిగా, శ్రీయుతులు వెంకట్రావు, అవధాని, ప్రయాగ రామకృష్ణ, శ్రీ సవాన్ తరువాతి ఉపన్యాసకులుగా ప్రారంభమైన ఆ పత్రికా సమావేశంలో దర్శకుడు శ్రీ ఎస్. డి లాల్ చిత్ర నిర్మాతల గూర్చి, కథానాయకుడు యిచ్చిన సహకారాన్ని గూర్చి వివరించారు.

"నిండుమనిషి" చిత్ర నిర్మాతల గూర్చి, దర్శకుడు శ్రీ లాల్ గూర్చి ప్రశంసావాక్యాలు పలికిన శ్రీ శోభన్ రాజయ్య పాత్ర తను నటించిన ఉత్తమశ్రేణి పాత్రలలో ఒకటిగా వక్కాణించారు.

కొన్ని అభిమాన సంఘాలు చేస్తున్న కార్యక్రమంపట్ల తన అసంతృప్తిని వెలిబుచ్చారు. చిత్రంలో "దమ్ము" వుంటే, వారు చేసే అల్లర్లు ఎలాంటి అవరోధాన్ని కలిగించవు అని ఉద్ఘాటించారు.

విజయవాడలోని ఒక థియేటర్లో తన చిత్రం ప్రదర్శిస్తున్నప్పుడు, ఎవరో కొందరు కోడిపెట్టచేత నాయన్ చేయించినట్లు తెలిపారు. పదహారు... యిరవై ఏజ్ గ్రూప్‌వాళ్లే అలాంటి పనులు చేస్తున్నారేమో అనెడి అనుమానాన్ని శ్రీ శోభన్ వ్యక్తం చేశారు.

చిత్రరంగంలో అగ్రకథానాయకుడుగా, అంటే నలుగురిలో ఒకడ్నిగా మరో 15 సంవత్సరాలు గ్యారంటీగా వుంటాను.

స్టారడమ్ వచ్చిన నాయకుడు పడిపోయాడు అనుకోవడమో, ఓడిపోయాడు అనుకోవడమో "భ్రమ" మాత్రమే అన్నారు శ్రీ శోభన్.

పై పత్రికా సమావేశం, శ్రీ పి. సుబ్రమణ్యం స్వాగతంతో, శ్రీ విశ్వనాథ్ మాలాహారధారణతో ప్రారంభమైంది.

## "రుద్రయ్య"లో రెండు జంటలు

విజయ... మాధవీ పిక్చర్స్ స్కోప్ వర్ణ చిత్రంగా నిర్మిస్తున్న "కటకటాల రుద్రయ్య"కు అగ్ర దర్శకుడు శ్రీ దాసరి అన్ని బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

ఈ చిత్రంలోని రెండు జంటలుగా కృష్ణంరాజు—జయసుధ, రామకృష్ణ—జయచిత్ర నటిస్తున్నారు.

రెండు ముఖ్య పాత్రలను రావు గోపాలరావు, షావుకారు పోషిస్తున్న యీ చిత్రానికి జె. వి. రాఘవులు సంగీతాన్ని, భాస్కరరాజు శిల్పాన్ని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని, బోసుబాబు నిర్మాణ నిర్వహణ శాఖను నిర్వహిస్తున్నారు. శ్రీ వడ్డె శోభనాద్రి నిర్మాత.

ఫిబ్రవరిలో ఒక షెడ్యూలు మార్చిలో రెండో షెడ్యూలు ప్లాన్ చేసినట్లు నిర్మాత శ్రీ వడ్డె రమేష్ తెలిపారు. అన్నపూర్ణా పంపిణీదారులు.

—శ్రీనివాస్ ★

'ఖైదీ నెం. 77'లో సూరిబాబు, మురళీమోహన్, ఏమూరి



'డూడూ బసవన్న'లో చలం, దీప



చిత్రకల్పన వెలిగించింది గోరంత దీపం...... కొండంత వెలుగిచ్చింది వాణిశ్రీ రూపం

ఫిబ్రవరి
17
విడుదల



వాణిశ్రీధర్
నటించు

# గోరంత దీపం

బాపు
బొమ్మ




మాటలు. నిర్మాణం ముళ్ళపూడి వెంకటరమణ

సంగీతం కె.వి.మహాదేవన్ —ఈస్ట్మన్ కలర్ ఫొటోగ్రఫీ ఇషాన్ ఆర్య

—అన్నపూర్ణ
విడుదల



'సీతామాలక్ష్మి'లో తాళ్లూరి రామేశ్వరి

# ఫిల్మోత్సవ్

[26వ పేజీ తరువాయి]

### ది ఇన్‌హెరిటెన్స్

(ఇటలీ–119 ని.లు). విపరీతమైన శృంగార సన్నివేశాలున్న చిత్రం. ఒక సామాన్య కుటుంబానికి చెందిన యువతి ధనాశచే ఒక సంపన్న కుటుంబంలోని యువకుడ్ని వివాహ మాడుతుంది. అతన్ని చెపటకింద జమకట్టి అతని తండ్రితోపాటు అతని అన్నను కూడా లోబరచుకుంటుందా యువతి. మామ వొళ్ళు తెలియని స్థితిలో తను చేసిన తప్పుకు చింతిస్తూ, తన తదనంతరం ఆస్తి యావత్తూ కోడలి పేరనే వీలునామా రాశాక ఆత్మహత్య చేసుకొని, ఆమె చేతుల్లోనే ప్రాణాలు వదులుతాడు. ఒక అన్న ఆత్మహత్య చేసుకోగా, మరో అన్న మతిభ్రష్టుడవడంతో వారి చెల్లెలు ఆ వీలునామా చెల్లదని దావా వేస్తుంది. మామగా ఆంతోనీ క్విన్ అద్భుతంగా నటించాడు. నాయిక పాత్రధారిణి డోమ్నిక్‌సాండా అప్సరసలా వుంది.

### షికా డా సిల్వా

(బ్రెజిల్ 110 ని.లు.) ఒక నీగ్రో యువతికి బానిసత్వం నించి విముక్తి కలిగించిన ఒక కాంట్రాక్టర్ ఆమెతో సంబంధం పెట్టుకుంటాడు. దాంతో ఆమె దశ మారుతుంది. ఐశ్వర్యంతోపాటు పేరు ప్రతిష్టలు కూడా సంపాదించాలనుకున్న ఆమె ఆశలు ఒక రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ ప్రవేశంతో అడియాసలవుతాయి. స్త్రీ నగ్నదృశ్యాలకు తహతహలాడేవారికి కథానాయిక కనువిందు చేస్తుంది. బ్రెజిల్ 18వ శతాబ్దం ద్వితీయ భాగంలో పోర్చుగీస్ కాలనీగా వున్నప్పుడు జరిగినట్లు చెప్పబడింది కథ.

### వన్స్ సింగ్స్, ది అదర్ డస్నాట్

(ఫ్రాన్స్, బెల్జియమ్ – 105 ని.లు.) 1962 లో కలుసుకున్నప్పుడు ఒక యువతి వయసు 17, మరో యువతి వయసు 22. పెద్దామెకు యిద్దరు పిల్లలున్నారు. గర్భస్రావం చట్టవిరుద్ధం కాకూడదని ఈమె వాదిస్తుంది. విరక్తి చెంది, తన గాయని వృత్తికి స్వస్తి చెప్పి, ఒకచోట ప్లానింగ్ సెన్స్‌గా చేరుతుంది. మరో యువతి బడిలో సంగీత బోధకురాలు. పదేళ్ల తర్వాత 1972 లో ఈ మహిళలిద్దరూ కలుసుకుంటారు. ఆ తర్వాత స్త్రీల హక్కులకోసం పాటుపడతారు. వేర్వేరు దారుల్లో వెళ్లినా యిద్దరి గమ్యస్థానమొక్కటే అని చిత్రీకరించడంలో దర్శకుడు కృతకృత్యుడయ్యాడు. వాళ్లిద్దరికీ యెడబాటు ఏర్పడిన ఆ పదేళ్లలో జరిగిన సంఘటనలు పోస్టుకార్డుల ద్వారా, కామెంటరీతో చెప్పబడడం పేర్కొనదగినది. కెమెరా కూడా కథాగమనానికి కొంతవరకు తోడ్పడింది.

### ఫియర్ ఈట్స్ ది సోల్

(ఎఫ్. ఆర్. జి – 93 ని.లు.) మనమలు, మనమరాళ్లు కలిగిన ఓ అరవైయేళ్ల వితంతువు తన పిల్లలను ఎదిరించి, తనకన్నా 20 ఏళ్ళు చిన్నవాడైన ఒక కార్మికుని పెళ్లాడడంతో నవజీవనం ఉత్సాహపూరితంగా వుంటుందని ఆశిస్తుంది. కాని, ఈర్ష్యాసూయలకు గురి అవుతుంది. వయోభేదం ఎన్నో యిబ్బందులకు దారితీస్తుంది. 'ప్రేమ' మీద యిదొక చక్కని పేరబల్.

### ది కేనిబాల్స్

(ఇటలీ – 88 ని.లు.) 'ఆంటిగోన్' అనే గ్రీక్ నాటకం ఆధారంగా తయారైన చిత్రం. తూటాలతో శవాలు రోడ్డుమీద పడుంటాయి. వాటిని తరలించకుండా అధికారులు అడ్డుపడుతూంటారు. తన అన్న శవాన్ని సక్రమంగా సమాధి చేయాలని ఒక యువతి ప్రయత్నించి, విఫలురాలవుతుంది. ఆ ఊరికి కొత్తగా వచ్చిన ఓ యువకుడు ఆమెకు సాయపడబోగా పోలీసులు చూసి వెంటాడుతారు. ఇద్దరూ పట్టుబడతారు. అమ్మాయి హింసించబడుతుంది. యువకుడు పిచ్చాసుపత్రికి పంపబడతాడు. ఆ అమ్మాయి కోసమే ఎదురుచూస్తూంటాడు. చివరికి పోలీసులు తీసుకెళ్తూన్న ఆ అమ్మాయిని చూస్తాడు. పోలీసులతో ఎదురు తిరిగిన వాళ్లిద్దరూ చంపబడుతూండగా ప్రజలంతా చూస్తూ ఊరుకుంటారే గాని, ఏమీ చేయలేకపోతారు. పదవీ ధరుల దారుణాలు సంఘాన్ని ఎంత నరకంగా మార్చివేస్తాయో సూటిగా చెప్పే ఈ చిత్రంలో పిచ్చాసుపత్రి సన్నివేశాలు మరపురానివి.

### ది అదర్ సైడ్ ఆఫ్ మిడ్‌నైట్

(యు. ఎస్. ఎ. 120 ని.లు) పడుపు వృత్తితో విపరీతంగా ధనం ఆర్జించిన ఓ యువతి తన మనసును అర్పించిన ఓ యువకుడు మరో యువతిని వివాహమాడడంతో క్రుంగిపోయి, వ్యయప్రయాసలతో అతని ఆచూకీ తెలుసుకుంటుంది. పైలెట్‌గా ఎక్కడో సుదూరంలో ఉన్న అతన్ని సతీసమేతంగా తన ఇంటికి రావించి, చివరిసారిగా అతనితో మధురానుభూతిని పొందుతుంది. దాంతో తన కసి తీర్చుకున్నంత తృప్తి పొందుతుంది. పచ్చి వ్యభిచారిణికి కూడా సామాన్యురాలిలా ప్రేమ అనేది ఉంటుందని 'సిడ్నీ షెల్డన్' నవల ఆధారంగా తయారైన ఈ చిత్రంలో 'ది టవరింగ్ ఇన్‌ఫెర్నో' ఛాయాగ్రాహకుడు ఫ్రెడ్ కొనియాంప్ తన ప్రతిభను మరోసారి నిరూపించుకున్నాడు. శృంగార సన్నివేశాలు ఎబ్బెట్టుగా వున్నాయి.

### ది సాండ్‌గ్లాస్

(పోలెండ్ – 124 ని.లు) ఒక పోలెండ్ రచయిత కథల ఆధారంగా తయారైన ఈ చిత్రంలో శిల్ప దర్శకుని, ఛాయాగ్రాహకుని ప్రతిభా విశేషాలు తప్ప పేర్కొనదగ్గవి ఇంకేమీ లేవు.

### ఫన్ విత్ డిక్ అండ్ జేన్

(యు. ఎస్. ఎ. 97 ని.లు) భర్తకు ఉద్యోగం పోయింది. ఇంటి మీది బాకీ తీర్చడం కోసం భార్యభర్తలిద్దరూ అప్పు కోసం ఓ బాంకికి వెళ్తే, ఇద్దరు గజ దొంగలు తుపాకీలతో బెదిరించి, వాళ్ళవద్ద వున్న డబ్బంతా తీసుకుపోవడంతో ఆ దంపతుల దృష్టి దొంగతనం మీద పడుతుంది. అలాగే డబ్బు ఆర్జిస్తారు. హాస్యరస చిత్రం.

### ఒన్ పీపుల్

(నెదర్లాండ్ 105 ని.లు) హీరో ఒక హైందవ యువతిని ప్రేమిస్తాడు. ఇంతలో అతని భార్య వస్తుంది. ఇరుకున పడతాడు. తల్లిదండ్రులతో ఘర్షణ కూడా. అంతే. హిందీ డైలాగ్‌లు, సంగీతం వున్నాయి. తమాషా ఏమిటంటే ప్రణయ సన్నివేశంలో నేపథ్యంలో "రఘుపతి రాఘవ రాజారాం" వినిపించడం!

### ఇల్లస్ట్రియస్ కార్ప్‌సెస్

(ఇటలీ – 118 ని.లు.) జడ్జీలను, మేజిస్ట్రేట్లను, ప్రాసిక్యూటర్లను చంపే ఒక విచిత్రమైన హంతకుని పట్టుకోడంకోసం విశ్వప్రయత్నాలు జరిగే ఒక డిటెక్టివ్ కథ. వింపాదిగా సాగుతుంది. దర్శకునికే నిశ్చితాభిప్రాయమున్నట్లు లేదేమో – అంతా ప్రేక్షకుల ఊహకే వదిలేయబడింది.

### మన్ స్మూరీ పాపా

(ఫ్రాన్స్ – 95 ని.లు.) పిల్లల పెంపకమూ ఒక కళే. తల్లి ఒక అమెరికన్ చిత్రకారుని పునర్వివాహం చేసుకొని వెళ్ళిపోగా తండ్రి వద్ద పెరుగుతూంటాడు ఒక పదేళ్ల అబ్బాయి. తండ్రే అన్నం వండిపెడుతూంటాడు. హోమ్‌వర్క్‌లు కూడా చేసిపెడుతూంటాడు. తండ్రికి మరో యువతితో సంబంధం ఏర్పడుతుంది. కొడుకు పదే పదే అడ్డుతగులుతూన్నందున ఆ యువతితో తండ్రి బాంకాక్‌కు వెళ్లి కొన్నిరోజులు గడిపి రావాలని ఆశపడతాడు. కొడుకు తాను కూడా వస్తానంటే, చాలా డబ్బు అవుతుందనీ, అంత డబ్బు తన దగ్గర లేదనీ అంటాడు తండ్రి. దాంతో కొడుకు ఒకచోట కాజేసిన 8 వేల ఫ్రాంకుల పైకం వున్న ఒక కవర్‌ను తండ్రికి తీసుకొచ్చి ఇస్తాడు. తండ్రి నివ్వెరపోతాడు. ఆ డబ్బు ఎక్కడిదో తెలుసుకొని, తన కొడుకును దండించకపోగా – తన తప్పిదాన్ని గుర్తించి, ఆ అబ్బాయిని తన హృదయానికి హత్తుకుంటాడు. వివిధ రసానుభూతులను కలిగించే చిత్రం.

### డోనా ఫ్లోర్ అండ్ హర్ టూ హస్బెండ్స్

(బ్రెజిల్ – 118 ని.లు.) జాదగాడు, అమిత కామవాంఛ గల భర్త మరణించగా ఒక యువతి మరొకతన్ని మళ్లీ పెళ్లి చేసుకుంటుంది. చనిపోయిన భర్త భూతమై వచ్చి ఆమె పొందు కోరుతాడు. అయితే, అతనామెకు తప్ప మరెవ్వరికీ కనిపించడు. ఆమెతోనే వుంటానంటాడు. ఇరకాటంలో పడిన ఆ యువతి భర్తలిద్దరికీ తన పడకలో ఇరువైపులా చోటిస్తుంది. అక్కడక్కడ 'బ్లూ ఫిల్మ్' అనిపించే ఈ చిత్రం హాస్య ధోరణిలో కొంతవరకు సాగుతుంది.

### కేమో ఫ్లేజ్

(పోలెండ్ – 106 ని.లు.) సమస్యలతో సతమతమయ్యే విద్యార్థులకు – ఉన్నతాధికారులకు మధ్య సామరస్యం కుదర్చడానికి అభ్యుదయ భావాలు గల ఓ ప్రొఫెసర్ పడ్డ పాట్లు – మందగమనంతో విసుగు కలిగిస్తుంది.

### హర్లాన్ కౌంటీ

(యు. ఎస్. ఎ – 103 ని.లు.) బొగ్గుగని కార్మికుల అగచాట్లు, సమస్యలు, కోర్కెలు. మేనేజిమెంట్ ఆ కోర్కెలను పట్టించుకోకపోవడం. దాంతో అలజడి. పోలీసుల జోక్యం. ఫీచర్ ఫిల్మ్‌లా నడిచే పెద్ద డాక్యుమెంటరీ చిత్రం.

### జాకీ ఇన్ ది బాక్స్

(ఫ్రాన్స్ – 100 ని.లు.) హాస్యరసప్రధాన చిత్రం. మల్టిమిలియనీర్ అయిన ఒక పత్రికాధిపతి ఆ నగరంలో జరిగే ఒక బొమ్మల ప్రదర్శనకు రిపోర్టర్‌గా తన వద్ద కొత్తగా చేరిన ఒక జర్నలిస్టును పంపిస్తాడు. అక్కడ బొమ్మలతో పాటు ఆ జర్నలిస్టును చూసిన ఆ పత్రికాధిపతి పదేళ్ళ కొడుకు – అతన్ని బొమ్మగానే భావించి తన యింటికి తీసుకురావాలని మారాం చేస్తాడు. అందుకు ఆ జర్నలిస్టును అందరూ ఒప్పిస్తారు. జర్నలిస్టును ఆ అబ్బాయి బొమ్మగా భావిస్తే, ఆ అబ్బాయిని జర్నలిస్టు ఒకసారి ఆటవస్తువుగా చేసుకొని పత్రికా కార్యాలయంలో నిష్కారణంగా తొలగించబడిన కొందరిని ఆ అబ్బాయి మూలంగా మళ్ళీ పనుల్లోకి తీసుకునేలా చేస్తాడు. తండ్రికన్నా ఆ జర్నలిస్ట్ పైనే మమత పెరుగుతుందా అబ్బాయికి. నవ్వించే సంభాషణలు, సంఘటనలు వున్న చిత్రం.

### మాయాకోవ్‌స్కై ఈస్ లాఫింగ్

(యు. ఎస్. ఎస్. ఆర్.) 'ది బెడ్ బగ్' అనే వ్యంగ్య రచన ఆధారంగా తయారైన చిత్రం. ఒక గిటార్ వాద్యగాడు విప్లవం ఆధారంతో ఒక ధనవంతురాలైన యువతిని పెళ్లాడుతాడు. కార్టూన్, ఏనిమేషన్‌లో కొత్త టెక్నిక్ అచ్చెరువొందిస్తుంది.

### బుడాపెస్ట్ టేల్స్

(హంగరీ – 91 ని.లు) ఆశ ఎంత సాహసానికైనా పురిగొల్పుతుంది... అంతా ఒక ట్రామ్ మీద జరిగిన కథ. యుద్ధానంతరం నివాసాలు కోల్పోయిన కొందరు తలక్రిందులుగా పడున్న ఒక ట్రామ్‌ను తమకు నిలువ నీడగా చేసుకుంటారు. ఆ తర్వాత దానిని పట్టాలమీద సరిగా పెడతారు. దాని దిషా ఉన్న ఏ నగరానికైనా అది తీసుకెళ్తుందని వారి ఆశ. అందుకోసం ఎన్నో విధాల ప్రయత్నిస్తారు. వివిధ మనః ప్రవృత్తులు గలవారి మానసికావేదన తెలియజేయడం తప్ప ఈ చిత్రంలో విశేషాంశాలేవీ లేవు.

### రోసలాండ్

(యు.ఎస్.ఎ.- 103 ని.లు) ఈ ప్రపంచమే ఒక నాటకశాల. అక్కడికి ఎప్పుడో ఒకప్పుడు అందరూ వచ్చి తీరుతారని చెప్పే మూడు కథానికలు. మూడు జంటల కథ. ఒక నాట్యశాలలో చిత్రీకరింపబడింది.

### ది వీసెల్స్

(అర్జెంటీనా – 105 ని.లు) నలుగురు వృద్ధులు తమ శేష జీవితాన్ని ఒక ఎస్టేట్‌లో వింపాదిగా గడుపుతూంటారు. ఒక నటిది ఆ ఎస్టేట్. దాన్ని ఆమె అమ్మాలని చూస్తుంది. ఆ వృద్ధులకు ఆ ఇంటితో పాశం ముడిపడింది. మృత్యువు సమీపించిన తమ గతి చివరికేమవుతుందోనన్న వారి భయాందోళన చక్కగా చిత్రీకరింపబడింది. ★

'పట్నవాసం'లో నృత్య సన్నివేశం



# శకుంతల-పెసరట్లు

పవన శర్మ



శేషగిరికి కబుర్లంటే బోల్డిష్టం. చలాని క్కూడా కబుర్లంటే అంతే ఇష్టం. కాని శేష గిరికి చలం చెప్పే కబుర్లంటే ఇష్టంలేదు. ముఖ్యంగా శకుంతలతో చెప్పే కబుర్లంటే ఇష్టం లేదు. అంటే తను శకుంతలతో చెప్పేవి కావు. చలం శకుంతలతో చెప్పేవి. శేషగిరికి శకుంతలతో కబుర్లు చెప్పటం ఇష్టం. మేడమీద చంద్రోదయ సమయంలో శకుంతల కళ్లల్లోకి చూస్తూ చెప్పడం మరీ యిష్టం. అల్లాంటప్పుడు, ఎంత అయిదోక్లాసునుంచి కలిసి చదువుకొన్నా, చలం దూసుకుని పైకివచ్చి కబుర్లలో చొరపడటం ఇష్టంఉండదు. కాని శకుంతలమాత్రం "రండి అన్నయ్యగారూ" అంటూ ఆహ్వానిస్తుంది. ఈ మధ్య చలం మరీ బరితెగించాడు. అతని పెళ్లాం కనకమహాలక్ష్మి పురిటికి పుట్టింటికి వెళ్లింది. పెళ్లాం ఊళ్లో ఉండగా అంత బరితెగించేవాడు కాదు. శేషగిరి పగతీర్చుకోవచ్చున్న భయం ఉండేది. కాని ఇప్పుడు కనకమహాలక్ష్మి పుట్టింట్లో ఉంది. మూడు నాలుగు నెలల్దాకా రాదు. అదీ ధైర్యం!

"చూడమ్మా! శకుంతలా! రేపాదివారం పొద్దున్న ఏం టిఫిన్ చేసుకొంటున్నారు?" అని మొదలు పెడ్తాడు.

"ఇంకా ఏమనుకోలేదు అన్నయ్యగారూ! ఏం చెయ్యమంటారు?" అని శకుంతల ఆపేక్షగా అడుగుతుంది.

"ఇడ్లీలు చెయ్యి. కొంచెం కొబ్బరి పచ్చడి, నీళ్లు తక్కువపోసి చెయ్యి. పోపులో ఒక్కటేఒక్క మెరపకాయ వెయ్యి. ఇంట్లో మజ్జిగచేసి తీసిన వెన్నకరగబెట్టి నెయ్యిచేస్తే ఇడ్లీల్లోకి ఉంటుంది" అని నిర్మొహమాటంగా చెప్తాడు.

"వద్దు పెసరట్లు చెయ్యి" అంటూ శేష గిరి అడ్డు పడితే, "పెసరట్లలో కారం ఎక్కువ పడ్తుంది, నూనెక్కువపడ్తుంది వంటికి మంచిది కాదు ఇడ్లీలు ఎన్నితిన్నా వంటికి చెరుపులేదు. అదే పెసరట్లయితే అజీర్తి, కడుపునొప్పి. నీకు వయస్సొస్తొంది కాని శేషుడూ! బుద్ధి పెరగటం లేదురా" అంటాడు.

"వారం అంతా మీక్కావాల్సినవి చేస్తూనే ఉన్నాను కదా ఆదివారం ఒక్కరోజు అన్నయ్యగారికి కావాల్సినవి చేస్తేపోలా" అంటుంది శకుంతల.

"ఏం చేస్తున్నావ్? నువ్వేం చేస్తున్నావో నేనేం తింటున్నానో కూడా గమనించకుండా తిని వెళ్లిపోతాను. ఆదివారం కాస్త తీరుబడిగా పెస రట్లు వేయించుకొని ఉప్మాలో తిందామనుకొం టుంటే, మధ్య వీడి ఇడ్లీల గోలొకటి"

"తప్పండి. మీ చెల్లెలు ఊళ్లో లేనప్పుడే కదా ఆయన ఎనింటికివచ్చేది. మీరల్లా మాట్లాడ కూడదు" అని శకుంతల లాలిస్తుంది.

"అవున్నా శేషుడు. నువ్వు పవిత్ర భారత దేశంలో పుట్టి అతిధిపట్ల అంత అగౌరవంగా మాట్లాడకూడదు. పూర్వం, వాళ్లకున్నా లేకున్నా అతిధికిపెట్టి తరించేవారు మన పూర్వీకులు. నేను, నిన్నుకూడా నాతోపాటు ఇడ్లీలుతిని నాలాగా ఆరో గ్యంగా అందంగా ఉండమంటున్నాను కాని నిన్ను మానుకొని నాకు పెట్టమనడంలేదుగా.

"నీలాగా పాత్రంలాగా తయారవాలన్న కోరిక నాకు లేదురా చలపతీ! పెసరట్లు వంటికి మంచివి కావు నేనొప్పుకుంటాను. అందుకని నువ్వు పెంద లాడే లేచి నీళ్లు పోసుకొని, ఉతికి ఆరేసిన బట్టలు కట్టుకొని 'రాముడు బుద్ధిమంతుడు'లాగా హోట లుకు వెళ్లి ఓ డజను ఇడ్లీలు తినేయ్."

"హోటలు సరుకు వంటికి మంచిదికాదు. పైగా నాకేం ఖర్మ మా చెల్లాయుంది చేసి పెడ్తుంది. నే తింటాను మధ్య నీ గొడవేమిటి?" అని కొట్టిపారేస్తాడు.

ఒక్క ఆదివారం ఇడ్లీలు తినాల్సిన బాధే అయితే శేషగిరి చిన్ననాటి స్నేహం కోసం ఓ నాలుగునెలలు సర్దుకొనును. కాని ఇడ్లీలు తింటూ చలం చెప్పే కబుర్లు వింటుంటే శేషగిరికి వళ్లు మండిపోతుంది.

"ఇవాళ ప్రభాత్‌లో అగ్గినటి, హిమాన్ నటించిన చిత్రరాజం చూద్దాం" అంటూ చలం మొదలుపెడ్తాడు. "అది బాగాలేదుట" అంటాడు శేషగిరి. శేషగిరికి ప్రేమ సామ్రాజ్యం. బంగారు ప్రేమికుడులాంటి ఫార్ములా సినిమాలు నచ్చవు.

"బావుండక పోవడమేమిటి ఎవరు చెప్పారు ? అది తీస్తున్న రోజుల్నుంచి అందరి హృదయాలనీ ఆ సినిమా దోచుకొంటుందన్న విజ్ఞాన్ని పత్రికా విలేఖర్లు మనకు చెప్తుంటే"

"అవునండీ! ఆ సినిమాలో హీరోయిన్ భరించలేని ప్రేమలో పడ్తుందిట"

శకుంతలకి ప్రేమ సినిమాలు కలర్‌లో తీస్తే చాలా యిష్టం. కలర్ సినిమాలో హీరోయిన్ కట్టుకొన్న చీర రంగు బోర్డరురంగు నెక్లెసులో రాళ్ల రంగులు స్పష్టంగా కనిపిస్తాయి. నలుపు తెలుపు సినిమాలలో ఈ సుఖం లేదు. పైగా డాన్సులు పాటలతో తీసే ఫార్ములా సినిమాలు ఎంచక్కా మూడు నాలుగు గంటలసేపు చూడవచ్చు. అదే ఏ ఎవార్డు విన్నింగ్ సినిమానో అయితే రెండు గంటల్లో అయిపోతుంది. ఖర్చు పెట్టిన డబ్బుకి ప్రతిఫలం దక్కదు. చలానికి దరిదాపుగా అదే అభిరుచి అయితే సినిమా చూసాక మాత్రం "మనం ఉన్నాం ఎందుకు ? కన్నడం వాళ్లలాగా ఒక్క సినిమా తియ్యలేము. ఉత్త చెత్త సినిమాలు" అంటాడు. చలం కన్నడ సినిమాలు చూడడు. శేషగిరి చూసి చెప్తే విని వంట బట్టించుకొన్నదే! తెలుగు సినిమాలు తప్పకుండా చూస్తాడు.

శేషగిరికి ఆదివారం సినిమాకి వెళ్లడం విసుగు. ఆరుగంటలకి మొదలుపెట్టే సినిమాకి అయిదు గంటలనుంచీ క్యూలో నిలబడా . అదీ హాలు గేటు బయట. తన స్టూడెంట్స్‌చూస్తే "ఈ మేష్టారి కింత పిచ్చేమిటి సినిమాలంటే" అనుకొంటారు. శకుంతల కా బాధలేదు. సినిమాలో చూడబోయే చీరలగురించో చూడబోయే డ్యూయెట్ల గురించో ఉత్సాహంలో కబుర్లు చెప్పేస్తూ ఉంటుంది క్యూలో నిలబడి. "నీముందు నిలబడ్డ వాళ్లలో మూడోవాడు నా స్టూడెంటు. అతగాడు నువ్వు మాట్లాడేది వింటున్నాడు. అంచేత అమ్మడూ! నువ్వు కాస్త నోరు మూసుకొని గంభీరంగా నిల బడు" అని శేషగిరి చెప్పలేడు. ఆ విద్యార్థి, మేష్టారు పెళ్లానికి సినిమాల పట్లగల ఉత్సాహాన్ని హాస్టల్లో కుర్రాళ్లకి పనిగట్టుకొని చెప్ప వచ్చే విషాన్ని తలుచుకొని భయపడకుండా ఉండనూ లేదు. "చివరివారం, వారం మధ్యలో వెళ్దాం" అంటాడు శేషగిరి.

"ఇంకానయం. ఆ రోజు కరెంటు ఫెయి లయితే మర్నాటి ఆటకు వెళ్లటానికి ఆసినిమా ఉండదు! అదే ఆదివారం వెళ్తే కరెంటు ఫెయి లయినా డబ్బు నష్టం లేకుండా ఆ టిక్కెట్టు మీదే సినిమా చూడటానికి గురువారం దాకా ఛాన్సుంటుంది. అదే చివర్లో వెళ్తే కరెంటు ఫేయిలయితే డబ్బు వాపసియ్యరు ఆ స్లైడు ఎన్ని సార్లు చూసాం" ? అని శకుంతల ఒప్పుకోదు.

చలం సినిమాల గురించి ఒక్కొక్క రోజున నోరు విప్పడు. ఆరోజున బజార్లో ఏ షాపుల్లో చీరల ధరలు తగ్గించి అమ్ముతున్నారో దాని గురించి మాట్లాడ్తాడు. అల్లాంటి రోజున శేషగిరే "ఇవాళ ప్రేమ పెన్నిధి సినిమాకి వెళ్దాం" అంటూ తనే సూచిస్తాడు చవకలో పోతుందని.

"సినిమాలు రోజూ ఉన్నవేగా. ఇవాళ బజారు వెళ్దాం. నేనెన్నాళ్ల బట్టో బెంగాల్ కాటన్ చీర కొనుక్కుందాం అనుకొంటున్నాను" అంటూ ఖరీదైన ప్రోగ్రామ్ పెడ్తుంది.

తెలుగు సినిమాలు చూచి "వెన్న కన్న మా అన్న మనసు మిన్న" లాంటి డైలాగులు వంట బట్టించుకొని "అన్నయ్యా!" అంటే "చెల్లెమ్మా" అనుకొంటూ ఈ చలపతీ శకుంతల, బోరు కొట్టేస్తున్నారు. వీళ్ల నెల్లాగైనా విడదియ్యాలి. లేకపోతే తనిద్దరి మధ్యాపస్తాడు అని శేషగిరి ఆలోచించి నిర్ణయించుకొని "ఎల్లాగా?" అంటూ తల బద్దల కొట్టుకుంటూ ఉండగా ఒకరోజు...

ఆరోజు క్లబ్‌కి వెళ్లాడు శేషగిరి. కనకమహా లక్ష్మి పుట్టింటికి వెళిన సందర్భంగా శేషగిరిని ఉద్ధరించని రోజున చలం క్లబ్బుని ఉద్ధరిస్తూ వుండే అలవాటుకొద్దీ చలం ఆరోజు క్లబ్బులో ఉన్నాడు. చేతులో పేకముక్కలు, ఎదుటి కూర్చున్నవాడు స్వపక్షంవాడే అయినా ఆటగాడి మొహాన కొట్టే భంగిమలో ఉన్నాడు. అడ్డాట మధ్యలో ఉన్నాడు.

అప్పుడు గబుక్కున శేషగిరి వెళ్లి చలం చేయి గట్టిగా పట్టుకొని "పేదవాడి కోపం పెదవికి చేటు. పొట్టివాడి కోపం వాడికే చేటు. నీ పార్ట నర్ ఎవరను కొంటున్నావు? అయిదేళ్ల క్రితం ఆయన మిస్టర్ యూనివర్సిటీ. వీవళ్ళు విరిచేయ గలడు. మా చెల్లాయి ఊళ్లోలేని కొద్ది రోజులు నీమీద ఈగ వాలనీనని మాటిచ్చాను. ఈగలనైతే తోలగలను. కాని ఈయన నీమీద వాలడానికి నిశ్చ యించుకొంటే పోలీసు వాళ్ల లాగా చూస్తూ ఊరుకోగలవాడనేకాని ఏమి చెయ్యలేను పద చల పతీ! ఈ పేకముక్కలు టేబుల్ మీద పారెయ్యి" అంటూ అడ్డుకొన్నాడు. ఆపైన ఇంటివేపు మళ్లించాడు.

"ఆట మొదలు పెట్టి నప్పటి నుంచి పదులు అవతల వాళ్ల పట్లమీద ఏళ్లూ ఎని మిదులు నా పట్ల మీదా వేస్తున్నాడు. అంత ఆట రాని వాడు మళ్లీ క్లబ్బుకి రాగానే అడ్డాఎవరికి వచ్చు? ఎవరాడ్తారు అంటూ పెద్ద ఛాంపియన్ లాగా గొడవ మొదలు పెట్టాడు. నువ్వు వచ్చే సరికి అది మూడో ఆట. మేం ఓడటం. నాకు శాంతం ఎక్కువ కనక రెండాటలు నోరు విప్ప లేదు ఊరుకొంటే ఈ ఆటలో నాకే బుద్ధి చెప్తు న్నాడు. నేను తుఝుపు చెప్పానా శేషుడూ! వాడిది దిగుడు చెయ్యి. వాడు తురుపు దిగ లేదు. నేను రాజు పెట్టి కోసి జాకీ ఆడాను. వాడు మణేలావేసి 'నామణేలా రాల్చే సారు మీరు' అంటూ దెబ్బలాడు తున్నాడు. నాకు వళ్లు మండి పోయింది.చంపేద్దా మన్నంతకోపం వచ్చింది." అన్నాడు చలం దారిలో.

"నిజమేరా మనకి పేకాటలో పార్ట్‌నర్స్‌ని చంపేద్దా మన్నంత కోపం వస్తుంది. కాని చంప రాదురా! అల్లా చంపుకొంటూపోతే మనతో ఆడటానికి మనుషులుండరు." అంటూ శేషగిరి 'శాంతము లేక సౌఖ్యము లేదు.' పాట పాడాడు. నాగయ్యలాగా వళ్లంతా కది పేసుకొంటూ అక్కడ క్కడా వినపడకుండా పాడాడు.

ఆరోజు రాత్రి శేషగిరి "పేకాట అడ్తుంటే ఈ చలపతిగాడి కింత కోపం వస్తుందా ? ఒక వేళ ఈ చలపతే శకుంతలతో పేకాడితే ఏమవు తుంది? ఏమన్నా అయితే ఫరవాలేదు. కాని ఏమీ కాకుండా వీడు, రోజూ పేకాటకి తయారైతే వస్తుంది చిక్కు నిజానికి వాడు శకుంతల ఆడు కొంటే రాదు. వాళ్లిద్దరు చేరి తన్ని రోజూ ఆడిస్తే వస్తుంది చిక్కు" అంటూ ఆలోచిస్తూ నిద్ర పోయాడు.

శకుంతలకి రంగు కెన్ని ముక్కలున్నాయో అడ్డాటలో తురుపులెన్నో గుర్తుండవు. బ్రిడ్జి టలో తను ఎప్పుడు తూదిడమ్మీఆడ్తోందో ఎప్పుడు టుది డమ్మీ ఆడ్తోందో తెలియదు. కాని పేకా టంటే మహా యిష్టం బొత్తిగా తనూ శేషగిరి ఇద్దరే ఆడ్తే ఇంట్రెస్టింగ్ ఉండదని ఆడదు ఎవరైనా ఆట బాగా వచ్చిన వాళ్ళువస్తే వాళ్ళతో కలిసి ఆడటం శకుంతలకి చీరల తరువాత సిని మాల తరువాత చెప్పుకో దగ్గ యిష్టం. శకుంత లకి శేషగిరన్నా ఇష్టమే కాని వీటన్నిటి తరువాతే! శేషగిరికి శకుంతలంటే వీరాభిమానం ఉంది. వీసెల కొద్దీ ప్రేముంది, అందుకని జీవిత నౌక నడపడానికి భాగస్వామినికింద స్వీకరించాడు కానీ శకుంతలను పేకాటలో పార్ట్‌నర్‌గా మాత్రం మనస్ఫూర్తిగా స్వీకరించలేదు. వనితలకి ముద్దార నేర్పిస్తే రాని వాటిల్లో లెక్కలే కాకుండా పేకాట కూడా ఉందని శేషగిరి నమ్మకం.

మర్నాడు సాయంత్రం క్లబ్‌కి వెళ్లడం ఇష్టంలేని చలం శేషగిరింటికి వచ్చాడు. సరాసరి మేడమీదకి దారితీసాడు గేటు చప్పుడవగానే శేషగిరి జేబులోంచి పేకదస్తా తీసి చేతులో పట్టుకొన్నాడు

"ఇద్దరమే ఆడు కుందామా ?" అని అడి గింది, శకుంతల చాలా ఉత్సాహంగా

"ఏమిటి ఆడదాం?" అనిఅడిగాడు శేషగిరి

"క్లియరెన్సు...ఛ మరీ చిన్న పిల్లలాట... సెవెన్స్... ఘోరం హనీమూన్ బ్రిడ్జి అదిబావుం టుంది. బ్రిడ్జి బావుంది—బ్రెయిన్‌కి కాస్త పని చెప్పే ఆట...హనీ మూన్ అన్న మాటే బోల్డు రొమాంటిక్‌గా ఉంది...అదాడదాం".

# శకుంతల పేకాట

శేషగిరి పెద్ద రిస్కు తీసుకొన్నాడు. వచ్చిన వాడు చలం అన్న ఉద్దేశంతో పేక తీసాడు. అల్లా కాకుండా కిందున్న తల్లితో పనున్న ఎవరైనావచ్చి ఉంటే తను తిరికూర్చుని శకుంతలతో పేకాడే చిక్కులో పడ్డాడన్నమాటే! శకుంతలకి పైగా చిన్న ఆటలు (నచ్చవు, మెదడుకి మేత పెట్టేవి తప్పించి. ఆటనావిధంగా ఎనుకొన్నాకె, మెదడుని కూరలో ఉప్పేసానా లేదా చాకలివాడికి పావలా ఎక్కువిచ్చానా? లాంటి విషయాలమీదికి కళ్ళాలు వదిలేసి పరిగెత్తనిస్తుంది అప్పుడు.శేషగిరి "నా బుద్ది గడ్డితిని వీతో ఆడుతున్నాను"అనుకొంటాడు. అనడు.

వచ్చినవాడు చలమే! అమ్మయ్య. "రారా! చలపతీ మీ చెల్లాయి కివాళ బుద్ధి పేకమీదకు పోయింది" అంటూ ఆప్యాయంగా శేషగిరి ఆహ్వానించాడు. శేషగిరి ఆప్యాయత చూస్తే చలానికి అనుమానం కలిగింది.

"ఇవాళ పేకాట ఆడే మూడ్ లేదురా. నీ డొక్కుకార్లో అలా బజారుకేసి వెళ్దాం. అక్కడ చొక్కాలు, లాగూలు, చీరలు అన్నీ చవగ్గా అమ్ముతున్నారట" అన్నాడు జాగ్రత్తపడూ.

"ఇవాళ ఎలచక్కా ఓ గంట పేకాడుకొందాం అన్నయ్యగారు ఆ పైన బజారుకెళ్దాం" అంటూ శకుంతల రాజీమార్గం సూచించింది.

చలానికి తప్పలేదు. కూర్చున్నాడు "కట్ త్రోట్ బ్రిడ్జ్ ఆడ్దామా శకుంతలా?!" అనడిగాడు శేషగిరి. శేషగిరి మొహంలో ఎక్కడా చలాన్ని ఉచ్చులో బిగించబోయే వేటగాడి లక్షణాలు లేవు. శకుంతలతో పేకాడటమే తన జీవిత ధ్యేయంగా పెట్టుకొన్న ఆదర్శపురుషుడి లక్షణాలు మాత్రం కొట్టవచ్చినట్టు కన్పిస్తున్నాయి. శకుంతల ఉత్సాహంగా తలాడించింది.

మొదటి ఆటలో శేషగిరి శకుంతల ఒకటయ్యారు. చలం బిడ్ నెగ్గి డమ్మీ కార్డ్సు తీసుకొన్నాడు. శకుంతల బజార్లో ఏ షాపులో రిడక్షన్ సేలుందో చలాన్ని అరాతీస్తూ ఫడామడా ముక్కలు వేసింది అలా ఆసులమీద తన రాజులు వేసింది. శేషగిరి పట్లను తను కోసింది. చలం గెలవటమే కాకుండా ఓవర్ట్రిక్కులు చేశాడు. శేషగిరి కోపం నటించాడు అతనికి నిజానికి కోపంరాలేదు. తను బిడ్ నెగ్గినప్పుడు, శకుంతల చలం పార్టీ అయి, అప్పుడిల్లాగే ఆడితే తను అనుకొన్నది సాధించగలడు. "ఒరేయి శేషుడూ! నీకు కోపం ఓపిసరు ఎక్కువరా!"అన్నాడుచలం. శేషగిరి ఒప్పుకొన్నాడు

సత్యమేవజయతే! అంతిమవిజయంఎప్పుడూ ధర్మానిదే. ఆ తరువాత రెండాటల్లోను, శేషగిరి డమ్మీ ఒకవైపు చలం శకుంతల ఒకటయ్యారు మొదటాటలో శకుంతల ఎన్నివిధాలుగా తప్పాడటానికి వీలుందో అన్ని విధాలుగాను ఆడింది

"చెల్లెమ్మా! నీ మనస్సు పేకాటమీదలేదు" అన్నాడు విసుగు దాచుకుంటూ చలం.

"అవునన్నయ్యగారూ! ఏడాదిబట్టి ఓ స్కూలుకుర్రాడు మా యింటికివచ్చి తను బీదవాడినని జీతం కట్టడానికి డబ్బుల్లేవని చెపూ్త రెండు మూడు తీసుకువెళ్తున్నాడు. ఇవాళ పబ్లిక్‌పరీక్షకి ఫీజు కట్టాలంటూ వచ్చాడు. నువ్వు ఏ స్కూల్లో చదువుతున్నావో చెప్పు నేను వెళ్లికడ్తాను అన్నాను. వాడు మీకెందుకు శ్రమ అన్నా నేను వినలేదు. ఆఖరికి చెప్పాడు. నేనేమోస్కూలుకికదా వెళ్లేదిలని కొంచెం సాధారణంగా తయారై వెళ్లాను. నేను మామూలుగా చాలా సింపుల్‌గా ఉంటాను కదా. ఇవాళ ఇంకా సింపుల్‌గా తయారై వెళ్లాను ఎర్రంచు తెల్లచీర మీదకి ఎర్ర బ్లౌజ్ కాకుండా తెల్లది వేసుకువెళ్లాను వెళ్లి ఆ అబ్బాయి ఎల్లా చదువుతున్నాడని క్లాసులో ఎలా ఉంటాడనీ అడిగాను. దానికి క్లాసు టీచర్ "వాడు మీ అబ్బాయా! వెధవ క్లాసులకి సరిగ్గారాడు. ఇవాళకూడా రాలేదు మీరు ఇంటిదగ్గర పరీక్ష జీతం కట్టమని ఇచ్చిన డబ్బులో సినిమాలు చూసాడు కాబోలు కట్టలేదు. క్లాసులు మానేసి అక్కడా ఇక్కడా తను బీద విద్యార్థినని చెప్పి ముష్టెత్తి డబ్బు సంపాదించి కడ్తాడు కాబోలు. వాడు ప్రతినెలా జీతం అల్లాగే కడ్తాడని మిగిలినపిల్లలుచెప్తారు"అన్నారు."ఏమండి అన్నయ్యగారు నేను ఆ ముష్టివెధవ తల్లిలాగా ఉన్నానా? నాకంత పెద్దకొడుకుంటాడని ఆ మేష్టరెల్లా అనుకొన్నాడు"అంటూ శకుంతలబాధ పడిరెండోఆట సరిగ్గా ఆడ్తానని వాగ్దానం చేసింది

తరువాత ఆటలో డమ్మీలో ఆసు, రాణి ఉంటే జాకీ ఆడింది. శేషగిరి రాణివేసిపట్టె ఆసులాడితే శకుంతల రాజు వేసింది. చలానికి కోపం వచ్చింది చలంమొహంలో మారుతున్న రంగుల్ని చూసి శేషగిరి సంతోషించాడు. "జాకీ ఎందుకు దిగినట్టు?" అని అడిగాడు. "ఆయన ఆసువేసి పడ్తారనుకొన్నాను" అంది శకుంతల. చలానికింత చిన్న లాజిక్ అర్థం కాలేదా అని ఆశ్చర్యపోయింది. చలానికి బుర్ర తిరిగిపోయింది. "చెల్లెమ్మా! నువ్వు పేకజోలికి పోకు నేను రేపట్నుంచి క్లబ్బులోనే ఆడుకొంటాను" అన్నాడు సెలవు తీసుకొంటూ

ఆ తరువాత చలం పెద్దగా రాలేదు. వచ్చినా శకుంతల పెసరట్లే పెట్టింది. "ఎంత అన్నయ్య అయితేమాత్రం తనకి పేకాట రాదంటాడా?" అన్నకోపంతో



TATA'S
501
NEW BLUE DETERGENT BAR
501
కొత్త

# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

**సాహిత్య వారం:-**

జనవరి చివరి వారాన్ని సాహిత్య వారం అనవచ్చు. దీనికి కారణం 24 వ తేదీనుంచి 30 వరకు ఆరు రోజులు ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో సాహిత్య సప్తతంతువు జరగడమే. 24, 25 తేదీలలో ప్రముఖ విద్వత్కవి, విమర్శకులు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి నన్నయ దర్శనం, భాస నాటక శిల్పం అనే విషయాలపై ప్రసంగించారు. మొదటి సమావేశానికి రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి డాక్టర్ అంతటి నరసింహం రెండవ సమావేశానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖ రీడరు డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు అధ్యక్షత వహించారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ 20 వ వార్షికోత్సవం 27 సాయంకాలం జరిగింది. కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు స్వాగతం చెబుతూ గడచిన 20 సంవత్సరాలుగా అకాడెమీ చేసిన కృషిని వివరించారు. డాక్టర్ గోపాల్ రెడ్డి శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిని విశిష్ట సభ్యత్వంతో గౌరవించారు. డాక్టర్ దివాకర్ల వేంకటావధాని శ్రీ ఇంద్రగంటి పాండిత్యప్రతిభల ప్రశస్తి చేశారు. తర్వాత డాక్టర్ గోపాలరెడ్డి ఆధునిక సాహిత్యంలో ఉత్తమ రచనకు బహుమతులు అందజేశారు. బహుమతి గ్రహీతలు: కవిత— శ్రీ ఎల్లోరా, నవల— శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం. కథానిక— విహారి, శాలివాహన, నాటిక శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణ శాస్త్రి, సాహిత్య విమర్శ— శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు. వీరి ప్రశంసను శ్రీమతి ఎస్. శమంతమణికృష్ణమోహన, శ్రీ దేవులపల్లి వారు అనారోగ్య కారణంగా రాలేదు. శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం లోగడ సాహిత్య విమర్శకు బహుమతిపొందారని, ఈ సారి నవలకు పొందారని, ఇలా రెండు మార్లు బహుమతి పొందినవారు వీరేనని డాక్టర్ గోపాలరెడ్డి అన్నారు. విహారి, శాలివాహన మొదటి నుంచి కలిసే జంటగా చదివి, జంటగా బి. ఎ. పట్టా పుచ్చుకొని, జంటగా రచనసాగించి, జంటగా బహుమతిపొందారనిఆయన అన్నారు. శ్రీ ఎల్లోరాను గట్టివాడు అని ప్రశంసించారు. పిదప శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి, సర్జనాత్మక రచనకు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ విమర్శ పరిశోధలకు స్వర్గీయ బెజవాడ పట్టాభిరామరెడ్డి, తిక్కవరపు రామిరెడ్డిగార్ల సంస్మరణసన్మానం పొందారు. వారిద్దరూ అనారోగ్యకారణం వల్ల రాలేదు. వారికి బహుమతులు పంపించబడుతాయని డాక్టర్గోపాల్ రెడ్డి తెలిపారు. ఉత్తమ సంస్కృత విద్వాంసుడుగా (అలంకార శాస్త్రం) శ్రీజమ్మలమడక మాధవ రామశర్మ సన్మానింపబడ్డారు. శ్రీ మాధవరామ శర్మ సంస్కృతంలో కృతజ్ఞత తెలిపారు. ఆయన ప్రశస్తిని డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు చేశారు. ఉత్తమ రచయిత్రిగా శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ సన్మానింపబడినారు. ఈమె ప్రశస్తిని డాక్టర్ నాయని కృష్ణకుమారి చేశారు. ఈ సందర్భంలో ఆస్థాన కవి డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులకు కూడా సన్మానం జరిగింది. సన్మాన కార్యక్రమం తర్వాత పన్నెండు వివిధ గ్రంథాలు ఆవిష్కరించబడ్డాయి. ఈ వేదికమీది నుంచే మెకంజి, కావలి సోదరుల సంస్మరణ సభ జరిగింది. కర్నల్ కాలిన్ మెకంజి సర్వేయర్ జనరల్‌గా వుండి, కావలి సోదరుల సహాయంతో పురాతత్త్వ, చరిత్ర శాసనపరిశోధనలకు శ్రీకారం చుట్టినవారు. సంస్మరణ ప్రసంగం శ్రీ ఆరుద్ర చేశారు. డాక్టర్ బోయి భీమన కృతజ్ఞతతో ఈ కార్యక్రమం సమాప్తమయింది.

ఆంధ్ర రచయిత్రుల నవమ మహాసభలు 28 29, 30 లలో జరిగాయి. గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ ఈసభలను ప్రారంభించారు. అధ్యక్షత వహించిన ప్రముఖ హిందీ రచయిత్రి, విదుషీమణి శ్రీమతి గౌరాపంత్ శివానీ (లక్నో) తమ ప్రసంగంలో వాస్తవికత రచయిత విజయానికి రాచబాట అన్నారు. కార్యదర్శిని కుమారి వాసిరెడ్డి సీతాదేవి సలహా సంఘ నివేదిక వినిపించారు. డాక్టర్ గోపాలరెడ్డి స్వాగతం పలుకుతూ, మహిళలలో అక్షరాస్యత తక్కువేఅయినా, రచయిత్రుల సంఖ్య ఎక్కువగానే వుందన్నారు. తర్వాత జరిగిన కవి సమ్మేళనానికి న్యాయమూర్తి శ్రీమతి అమరేశ్వరి అధ్యక్షత వహించారు. శ్రీమతి కె. జ్యోతిర్మయి కవిత శ్రోతలను విశేషంగా ఆకర్షించింది. రెండవ నాడు గడచిన ఇరవై సంవత్సరాలలో తెలుగు సాహిత్య విమర్శ పై జరిగిన గోష్ఠిలో విద్యేశ్వరి చాగంటి తులసి, పి. సరళాదేవి, మంగళగిరి ప్రమీలాదేవి పాల్గొన్నారు. అధ్యక్షత వహించిన శ్రీమతి వూటుకూరి లక్ష్మీకాంతమ్మ తమ ప్రసంగంలో కిరాతక దృష్టిలో సాహిత్య విమర్శ చేయరాదు. అది సామాజికారోగ్యానికి పనికి వచ్చే విధంగా వుండాలి. సృష్ట్యాది నుంచి జీవిత విధానానికి సాహిత్యం ఒక గొడుగు వంటిది అన్నారు. గోష్ఠి ప్రారంభించిన డాక్టర్ సి. ఆనందారామం. భారతి వంటి ప్రముఖ సాహిత్య పత్రికలలో వచ్చిన విమర్శలను సమీక్షించారు. కుమారి డి. విద్యేశ్వరి విమర్శా విధానంలో మార్పులు రావాలని సాహిత్యములో వైవిధ్యం లేనప్పుడు విమర్శలు అసాధ్యమని సరైన విమర్శలు లేవని అన్నారు. రచయిత్రులు స్థిత ప్రజ్ఞతో రచనలు చేయాలన్నారు. శ్రీమతి చాగంటి తులసి విమర్శ సమన్వయ పూర్వకంగా వుండాలన్నారు. మూడవనాడు గడచిన ఇరవై సంవత్సరాలలో తెలుగు కథానిక పై

గోష్ఠి రసవత్తరంగా జరిగింది. మద్రాసు క్వీన్ మేరీస్ కాలేజీ ఆంధ్ర శాఖాధ్యక్షురాలు ఆచార్య జి. లలిత అధ్యక్షత వహించారు. కథలో వైవిధ్యం వైశిష్ట్యం వైదగ్ధ్యం వుండాలన్నారు ఆమె. నవలల యుగమైన ఈ కాలంలో కథకు భవిష్యత్తు సందేహాస్పదమేనన్నారు. స్వరాజ్యం వచ్చిన ఈ సురాజ్యంలో సంఘంలోను, సాహిత్యాంగమైన కథలోను రావలసిన మార్పు చాలా వుందన్నారు. ఐ. వి. ఎస్. అచ్యుతవల్లి గోష్ఠి ప్రారంభించారు. కొలిపాక రమామణి చాల ధైర్యంగా ప్రసంగించారు కొన్ని కథలు చదువుతుంటే కడుపులో తిప్పుతుంది. భానుమతి కథలు చదువుతుంటే, నవ్వు పుట్టదు. చాలమంది పరిస్థితి చూపుతారు గాని పరిష్కారం సూచించరు. మంచి వ్యంగ్యం వ్రాసే వారిలో నాకాటి ఒకరు. అని రమామణిఅన్నారు. పీడిత ప్రజల సమస్యల పై కథలు చాల తక్కువగా వస్తాయన్నారు. కొండముది రుక్మిణీదేవి పాఠకులు ఎదిగితే గాని మంచి కథలు రావన్నారు. వేదుల శకుంతల. సంఘాన్ని అద్దం పట్టి చూపేదే ఉత్తమ సాహిత్యమన్నారు. గోవిందరాజు సీతాదేవి. 30 వ తేదీ ఉదయం ముగింపు సమావేశంలో గడచిన ఇరవై సంవత్సరాలలో తెలుగు వ్యాసం పై గోష్ఠి జరిగింది. సుప్రసిద్ధ విమర్శకురాలు నవలా రచయిత్రి, ధైర్యానికి, నిష్పక్షపాతానికి పెట్టింది పేరు అయిన శ్రీమతి తెన్నేటి హేమలత అధ్యక్షత వహించారు. డాక్టర్ రావి భారతి గోష్ఠి ప్రారంభించారు. రాష్ట్రంలోని ఉత్తమ కథకులలో ఒకరు శ్రీమతి ఆర్. వసుంధరాదేవి, శ్రీమతులు టి. వాణిరంగారావు, ముక్తేవి భారతి, నాయని కోటేశ్వరి పాల్గొన్నారు. వ్యాసాలలో ఇంకా వైవిధ్యం రావాలని గోష్ఠి పర్యవసానం. ఏమైనా రాజకీయాల సిగపట్లతో అభ్యర్థుల జాబితాల సహస్రనామాలతో సతమతమవుతున్న జంట నగరాల వారికి ఎంతో హాయి కలిగించాయి. ఈ సాహిత్యోత్సవాలు.

## ఉపశ్రుతి :

రచయితలకంటే రచయిత్రులే మెరుగనిపించారే నిర్భీకతతో, భావుకతతో, ఆత్మవిశ్వాసంతో చమత్కారంలో! అని అన్నారు నాతో ఒక శ్రోత ఆంధ్ర రచయిత్రుల మహాసభలో. అవును ఎందుకు మెరుగనిపించరూ అంటే? మగవారిలాగా వారికి కాకాపట్టడం అవసరం లేదు. మనుష్యులు పోతారన్న భయం లేదు. సహజంగానే వారికి కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడ్డం అలవాటు అది సాహిత్యంలోనూ అనువర్తించింది. అన్నారు. ఒక విద్వాంసులు. (పేరు చెప్పను) వెనుకకూర్చున్న ఒక మనస్తత్వవేత్త అన్నారు కదా అయ్యో స్త్రీలకు మనుష్యులను పోగొట్టుకుంటామనే భయం లేదు మనుష్యులు తమ వెంట తిరుగుతారని వారికి తెలుసు. పురుషులు మనుష్యులను వెంట తిప్పుకోలేరు గనుక. మనుష్యులను కూడగట్టుకొందామని కాకా పడుతూంటారు. అని ●

# వారఫలం

మహేష్

**24-2-1978 శుక్రవారం మొదలు**
**2-3-1978 గురువారం వరకు**

**మేషం:—** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పోటీ వారి పోటీ పెరుగుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో అనవసరమైన శ్రమ కలుగుతుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

**వృషభం: —** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**మిధునం:—** ఆర్థిక వ్యవహారాల్లో మొహమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీ అంచనాలు తారుమారు కాగలవు. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. పోటీ వారిలో గౌరవం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం:—** రావలసిన డబ్బు అందగలదు. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. వృత్తిలో పోటీ వారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కన్య:—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల:** ఫలితం లేని శ్రమ కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**వృశ్చికం:** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది వారం మధ్యలో చికాకులకు గురి కాగలరు. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**ధనుస్సు:** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మకరం:—** సంతోషకరమైన వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**కుంభం:—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో రావలసిన డబ్బు అందుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. పోటీ వారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో అప్పు వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. ●

# వెలుగొస్తుంది

**దేశెట్టి కేశవరావు**



చివాల్న మంచం మీది నించి లేచి లైటు వేశాడు కృష్ణారావు.

వెన్నెల్లాంటి వెలుతురు గదంతా పరచుకుంది. అలవాటు లేని వెలుతురుకి అతడి కళ్ళు అరమూతలు పడ్డాయి.

మెల్లగా కళ్ళు తెరచి గడియారం వంక చూశాడు. పదిన్నరయింది.

"అబ్బ! యింకా చాలా టైముంది!" అని విసుగ్గా దీపం ఆర్పేసి మంచం మీద వచ్చి కూలబడ్డాడు.

నిద్దర రావటంలేదు. లేచి ఒక్క గుక్క నీళ్ళు తాగుదామనుకున్నాడు. నైట్ లాంపు గుడ్డి వెలుతురులో మెల్లగా నడచుకుంటూ వెళ్ళి, కూజాలో నీళ్ళు గ్లాసులో వొంపుకుని తాగాడు. అలవాటుగా చేతులు సిగరెట్టు పెట్టెను వెతక బోయాయి కానీ వెంటనే ఆ పని విరమించుకుని మంచం మీదకి వచ్చి చేరాడు.

# వెలుగొస్తుంది

"ఇక ఇవాళ్టికి సిగరెట్లు కాల్చకూడద"నుకున్నాడు. ఇప్పటికే గొంతంతా మండిపోతూ వుంది. మధ్యాహ్నం నించీ రెండు పాకెట్లయిపోయాయి.

గదిలో, బయటా నిశ్శబ్దం నాట్యమాడుతోంది. గడియారం ఆ నాట్యానికి "టిక్కు, టిక్కు"మని తాళం వేస్తోంది. కృష్ణారావు మనసు ఆలోచనలతో రెప రెపలాడుతోంది.

రేపు యీ పాటికి!

ఏంత సందడి, ఎంత సరదా! వేడుకలు, ముచ్చట్లు, సరసాలు, పరాచికాలు!

పెళ్ళికి ముందు ఒకసారి వాణిని వొంటరిగా కలుసుకోవడం సాధ్యమవుతుందా? మామూలుగా నయితే సాధ్యమే! కానీ, పెళ్ళికొడుకు వేషంలో వుండగా ఎలా వెళ్ళడం? అందరూ చూస్తారు. అడుగు కదలనివ్వరేమో! అమ్మ గనక చూసిందంటే! చెప్పాలా, అక్షింతలు అప్పట్నించే ప్రారంభం!

పోనీ, ఎలాగో అందరి కళ్ళూ కప్పి, తప్పించుకుని వెళ్ళామనుకో! వాణిని కలుసుకున్నామనుకో! ఏమంటుంది? సిగ్గుపడుతుందా? అందంగా కాటుక దిద్దిన చారడేసి కళ్ళతో చురుక్కున చూసి, చటుక్కున తల దించేసుకుంటుందా?

అప్పుడేంజెయ్యాలి? లలితంగా మృదువుగా గడ్డాన్ని పట్టుకుని, మొహాన్ని పైకెత్తి సొట్టబడిన బుగ్గలమీద చిటికె వేసి ...

ఆఁ, సింగినాదం! అప్పుడు వీధుల్లో తనతో తిరుగుతున్నప్పుడు లేనిసిగ్గు, తనతో షికార్లకీ, సినిమాలకీ వచ్చినప్పుడు లేని సిగ్గు యిప్పుడు ముంచుకొస్తుందేం?

ఏమో చెప్పలేం! ఎంతైనా పెళ్ళికూతురు కదా! అదేం ఖర్మమో, పెళ్ళికూతురు అనే టైటిల్ యిచ్చేటప్పటికి యీ దేశంలో ఆడకూతుళ్ళంతా నిద్రగన్నేరులాగా ముడుచుకుపోతారు. కాస్త సహజంగా వుండ కూడదూ! ఇన్ని చాదస్తాలుంటే యీ దేశం బాగుపడేదెప్పుడు? అసలు యిలాంటి అసంగతపు ప్రవర్తనని దులిపి, తూర్పార బట్టకుండా రచయిత్రులంతా ఏం చేస్తున్నట్టు?

తను వెళ్ళినప్పుడు, వాణి మామూలుగా "హలో, కృష్ణారావుగారూ! రండి! కూర్చోండి! ఏమిటిలా వచ్చేశారు? మీ వాళ్ళంతా ఏరీ?" అని అడిగితే బావుణ్ణు.

"లేదండి! వాళ్ళంతా విడిదింట్లోనే వున్నారు. నేనే, యీ వూరొచ్చాను కదా, మిమ్మల్ని ఓసారి చూసి పోదామని వచ్చానండి!" అంటాడు తను, నవ్వును అణుచుకుంటూ.

"అన్నట్టు మరిచేపోయాను. అభినందనలండీ! మీరు పెళ్ళికొడుకు అవబోతున్నారటగా! మా ఫ్రెండు చెప్పింది! హార్టీ కంగ్రాట్యులేషన్స్ ... ఇంతకీ పెళ్ళికూతురెవరో చెప్పారేగారు!" అమాయకంగా అడుగుతుంది వాణి.

"చెప్పేయమంటారా?" సంకోచిస్తున్నట్టు అడుగుతాడు తను.

"చెప్పెయ్యండి సార్! పెళ్ళికొడుకయి వుండీకూడా, పెళ్ళికూతుర్లా బిడియం చూపిస్తారేమిటి?" అంటుంది వాణి.

"అయితే వినండి! 'వావిలిపూవు'లో మొదటి అక్షరం, 'ఆణిముత్యం'లో రెండో అక్షరం కలిస్తే..."

"అబ్బ! ఆగండాగండి! మీరేదో గళ్ళ నుడికట్టులాగా ఆధారాలిస్తే మా వంటివారి కెలా అర్థమవుతుంది? క్లియర్‌గా చెప్పండి మరి!"

"క్లియర్‌గా చెప్పమంటారా? సరే, అయితే 'వానరం'లో మొదటి అక్షరం, 'శిరోమణి'లో ఆఖరు అక్షరం కలిపి చదువుకోండి! మీకే అర్థం అవుతుంది!"

వాణి ఉడుక్కుంటుంది!

తను ఉద్యోగంలో చేరినరోజు తవకింకా జ్ఞాపకం వుంది. సాయంత్రం ఆఫీసునుంచి 'మధులత' వేపు వెళ్తుంటే అకస్మాత్తుగా చిన్ననాటి స్నేహితుడు రమణారెడ్డి కనిపించాడు, జడ్డి వెధవలా నవ్వుతూ.

"ఓరి నువ్వేన్రటా! నేను పోల్చుకోలేకపోయాను సుమా!" అన్నాడు కృష్ణారావు విస్తుపోతూ.

"అవున్రా నాకు తెలుసు!! వీటి కంతటికీ నా పళ్ళు కారణం! నా ముందు పళ్ళు ఊడిపోబట్టే కదా, నువ్వు నన్ను సులభంగా పోల్చుకోలేకపోయావు!" అన్నాడు నిట్టూరుస్తూ.

"అవును! అదీ వొక కారణమే! ఇంతకీ ఆ పళ్ళెలా వూడాయి? కొంపదీసి ఏమన్నా"

"ఛ ఛ! లవ్ అఫేర్స్ కావు నీకు సందేహం అక్కరలేదు ఇది అశ్వమేధో పాఖ్యానంవల్ల కలిగిన ఫలితం!'' అన్నాడు.

'అంటే?'' అర్థంకాక అడిగాడు కృష్ణారావు.

"వోసారి జట్కాలో వస్తుంటే,గుర్రం కాలు తప్పి పడిన ఫలితం!''

"అలాగా!''

రమణారెడ్డి ముందుకువంగి రహస్యంగా అన్నాడు : "కానీ వొక్క విషయం. కిట్టని వెధవలు, నన్ను నన్ను... అదే... గాడిద తన్నడంవల్ల పళ్లు విరిగ యని అనుకుంటుంటారు. నువ్వులాంటి కథలేవి నమ్మకేం?'' అన్నాడు,

"ఛ ఛ! నేను నమ్మను. వొట్టు!'' అన్నాడు సీరియస్‌గా వుండాలని యత్నిస్తూ.

తర్వాత వాడి గదికి తీసికెళ్లి వాడువేసిన పెయింటింగ్సన్నీ చూపించాడు. "చూశావా యీ గాంధీబొమ్మ! ఇది డూప్లికేటు. దీని ఒరిజినల్‌ని పంతొమ్మిది వందల డెబ్భయిలో ముఖ్యమంత్రికి పర్సనల్‌గా ప్రజంట్ చేశాను. బాగుందా యీబొమ్మ'' అని అడిగాడు.

"సూపర్బ్!'' అని మెచ్చుకున్నాడు కృష్ణారావు.

లోగొంతులో అన్నాడు రమణారెడ్డి : "గిట్టని వెధవలు నేను యీ పెయింటింగుని గుంటూరులోని ఆర్టీసీ బస్‌స్టాండు దగ్గరున్న మహాత్మా స్టూడియోలో వేయించానని అనుకుంటారు. నువ్వలాంటి కథలేవీ నమ్మకేం?''

"ఛ ఛ! నీ సంగతి నాకు తెలీదు కన కనా!'' అన్నాడు కృష్ణారావు

వాళ్ళింటిపక్కనున్న యిల్లే వాణివాళ్లది. అప్పుడే ఆమెతో పరిచయం జరిగింది. వాణి చాలా గడుసుపిల్ల అని మొదట్లోనే గ్రహించాడు కృష్ణారావు. రమణారెడ్డి భేషజానికి తగినట్టుగా, అమాయకంగా మాటాడుతున్నట్టుగానే అతణ్ణి ఏడిపించేది. "రెడ్డిగారూ! ఈ చిత్రం యిదివరలో ఎక్కడో చూసినట్టు అనిపిస్తోందండీ! అయితేనేం, యిది ఒరిజినల్ కంటే వెయ్యిరెట్లు అద్భుతంగా వుంది !'' అనేది. ఇదంతా పొగడ్తేననుకుని రెడ్డి ఉబ్బి పోయేవాడు. ఆమె చురుకు తనమూ, తెలివీ, అందం చూసి కృష్ణారావు ముగ్ధుడయాడు. సహజంగా నెమ్మది వాడయిన అతడి ప్రవర్తనకి వాణి కూడా ఆకర్షితురాలైంది. తరవాత వాళ్ల పరిచయం వృద్ధికావడమూ, మంచి స్నేహితుల్లాగా కలిసి తిరగడమూ క్రమ క్రమంగా జరిగింది. ఆ రోజు తలచుకుంటే టెక్నికలర్ కల లాగా వుంటవి. అయితేనేం ? యింతటి మధురమైన కలలో కూడా భయంకర వర్షాల తుఫానులు రేగాయి. చివరి కంతా హాయిగా ముగియబోతోంది. తను కోరుకున్న అమ్మాయిని తను స్వంతం చేసుకోబోతున్నాడు ఇలాంటి అదృష్టం ఎంతమంది కుంటుంది ?

లైటు వేసి మళ్ళీ వాచీ చూశాడు. పదినలభై అయిదు అయింది.

ఛ! యిలాక్కాదు. ఈ గడియారం త్వరగా పడవదు ! కాసేపు కళ్ళుమూసుకుని పడుకుంటే ఆలోచనలని కట్టిపెట్టి, ఆనందానికి అడ్డుకట్టవేసి నిద్రపోవడానికి ప్రయత్నిస్తే కాలం యిట్టే గడిచిపోయినట్టు అనిపిస్తుంది.

కృష్ణారావు తలగడ సరిచేసుకుని, విసుగ్గా మంచం మీదికి వాలిపోయాడు.

*   *   *

పక్కనున్న మంచం మీది నుంచి సన్నగా గుర్రు వినిపిస్తోంది.

అసహనంగా సుందరమ్మ మంచం మీద రెండోవైపుకి ఒత్తిగిలింది. తల వెనకకి తిప్పి ఒకసారి ఆయనకేసి చూసింది అసూయగా.

"ఏం మనిషో ! నిమ్మకి నీరెత్తినట్టు ఎలా నిద్రపోతున్నారో!'' అనుకుంది సుందరమ్మ. తనకి మా తం నిద్ర రావటం లేదు. అసలు ప్రయాణం ముందుంచుకుని నిశ్చింతగా ఎలా నిద్ర పోగలుగుతారో ఆయన !

"ఆయన తత్వమే అంత !'' అనుకుంది సుందరమ్మ. అమ్మాయి సంధ్యకి పెళ్లి చేసినప్పుడు మాత్రం ! ఓ వైపున పందిరి వెయ్యడం, పెళ్లి పనులూ, యితర వ్యాపకాలతో కాళ్లు తొక్కుకుని తనూ, కుర్రాడూ సతమత మవుతూంటే, పడక కుర్చీలో కూర్చుని, నిష్పూచీగా కునుకు తీస్తున్నారాయన. తనకి చిరాకెత్తి, ఒక్క గావుకేక పెట్టేసరికి, గబుక్కున లేచి కూర్చుని, "అంతా రెడీ అయినట్టేనా ? నాకు తెలుసే సుందరం ! నువ్వు అసాధ్యురాలివి. గవర్నరు కావలసిన దానివి !'' అన్నారు. ఎంత సిగ్గులేని మనిషో.

"ఇంతకీ ఇప్పుడు టయిమెంతయి వుంటుందో !'' అనుకుంది సుందరమ్మ. పదో పదకొండో అయివుంటుంది అయిదున్నరకి ప్రయాణం. "కావలసినవన్నీ సర్దానో లేదో, !'' అని ఆందోళన పడిందామె. పోనీ ఏమైనా మర్చిపోతే మాత్రం నష్టమేం ? మగపెళ్లి వాళ్లకి ఆ మాత్రం సౌకర్యం చెయ్యకపోరు అనుకుంది. పైగా వాళ్ళు మంచి వాళ్లలాగా వున్నారు కూడాను.

మొదట్లో తనీ పెళ్ళంటే ఎంత భయపడింది. ఉద్యోగానికి ఏలూరుకెళ్లిన



వాడు ఆర్నెల్ల తర్వాత తిరిగొచ్చాడు. అదీ వెంటనే రమ్మని వైరిస్తే.

వాడొచ్చాక "ఒరేయ్ కృష్ణా! లాయరు రంగారావుగారు వాళ్ళమ్మాయిని మనకిస్తా మని అడగడాని కొచ్చారు. గిరిజ చక్కని చుక్క. కట్నాలనీ, లాంఛనాలనీ గట్టిగా అడగ కూడదనుకో! అయినా రంగారావు గారు మనకేమీ తక్కువ చెయ్యరు పెళ్లి

# వెలుగొస్తుంది

కావలసిన పిల్లలింకా ఆయన కున్నారులే! అది వేరేమాట. మనవరకూ పెట్టిపోతలకు లోపంరాదు. నువ్వు అమ్మాయిని చూసి, 'వూఁ!' అన్నావంటే..." అంది తను.

"నేనీ పెళ్లి చేసుకోను!" అన్నాడు ఖండితంగా కృష్ణారావు.

"అంటే?" కోపంగా అడిగింది.

"అంటే అంతే!" అన్నాడు కృష్ణ.

"ఏమండీ వింటున్నారా? వాడేమంటు న్నాడో!" ఆందోళనగా అంది తను.

"వింటున్నా, వింటున్నా!" అని తల వూపారాయన.

"మరయితే వాడికి గట్టిగా చెప్పండి. యిది మనకి నచ్చిన సంబంధమనీ కాదన డానికి వీల్లేదనీనూ!"

"నీ కంటే గట్టిగా అరవలేనే, నాకు దగ్గు వస్తుంది!" అన్నారాయన.

"మీరేం చెప్పినా నే నొప్పుకునేది లేదు! నేను వాణినే పెళ్లిచేసుకుంటా!" అన్నాడు కృష్ణారావు.

"అదెవ్రరానాయనా?" ఆమె గుండెల్లో రాయిపడింది. తను అనుమానిస్తూనేవుంది తన పుత్రుడిలాంటి తెలివి తక్కువపనేదో చేస్తాడని. ఏ కులమో ఏ గోత్రమో తెలి యదు. పోనీ డబ్బు! డబ్బు మాటేమిటి? ఎంత కనిష్టమనుకున్నా పదివేలు—పదివేలు నష్టం వస్తుందే! బాధపడిపోయింది తను

"నేను వాణిని పెళ్లి చేసుకోవడం నిశ్చయం... మీరు మీ పెద్దరికం నిలుపుకో దలచుకుంటే. వాళ్లు వాళ్ళని కలుసుకుని 'తథాస్తు' అనిపించండి లేకపోతే మీకేమీ మిగలదు!" నిర్మొహమాటంగానే చెప్పాడు కృష్ణారావు.

ఆ మాటలకి తనెంత హైరానా పడిందో చెప్పడానికి సాధ్యం కాదు. "అడ్డాల నాడు బిడ్డలుగానీ..." అనుకొని గుండె దిటవు చేసుకుంది. నయాన, భయానచెప్పి మనసు మార్చాలని యత్నించింది. ఎంత ప్రయ త్నించినా వినలేదు కృష్ణారావు. చివరికి "మగపెళ్లివాళ్ళం. మమ్మల్నివాళ్లదగ్గరకు వెళ్ళమంటావేమిట్రా?" అని అడ్డు చెప్పింది.

"ఏం, అలా వెళ్ళకూడదని ఏమైనా

ఆఫీసు ప్రాసీజరుందా?" పెడసరంగా అన్నాడు కృష్ణ.

"సంప్రదాయం..." అంటూ నీళ్ళు నమిలింది తను.

"ఆఁ! గాడిదగుడ్డు!... ఏం చేస్తారో! మీరే వెళ్తారో, వాళ్ళనే పిలిపించుకుంటారో త్వరగా తేల్చేయండి!" అని చివరి మాటగా చెప్పి. ఏలూరుకి వుడాయించాడు.

తనకి మనస్సు స్వాధీనంలోకి రావడానికి నాలుగైదు రోజులు పట్టింది. వున్న వొక్క కుర్రాడూ ముచ్చట పడుతున్నాడు. వాడి ఆనందమే తమ ఆనందమని చివరికి నిశ్చయానికొచ్చింది. వాళ్ల స్థితిగతులేమిటో పరిశీలిద్దామని వాళ్ల వూరుకి బయలుదేరింది.

తను ఫలానా అని తెలిసేసరికి వాళ్ళెంతో ఆదరం చూపారు. అమ్మాయి కూడా తనకి నచ్చింది. అరమరికలు లేకుండా, చురుగ్గా తిరిగే అమ్మాయిని చూసి తను కూడా సంతృప్తి చెందింది. అయితే డబ్బు విషయం ఓమ్మూల బాధిస్తూనే వుంది.

"మా కృష్ణకి పదివేలిస్తామని వస్తున్నారు" అంది బింకంగా.

"పదివేలాండి? అంతకి మేంతూగలేం" అని నీళ్ళు నమిలాడు వియ్యంకుడు.

"మాకున్నది వాణి ఒక్కర్తే. ఎలాగో తల తాకట్టుపెట్టి మీ ముచ్చటలు తీరుస్తాం" అంది వియ్యంకురాలు.

సుందరమ్మ మనస్సు తేలికపడింది. ఎలాగైతేనేం తన కోరిక లన్నింటికీ వాళ్ళొప్పుకున్నారు. ఒకవేపు కొడుకుకోరిన అమ్మాయే దొరికింది, మరోవైపు తన ముచ్చటా తీరింది. ఆమె మనస్సు సంతోషంతో నిండిపోయింది.

"టైమెంతై వుంటుందబ్బా?" అనుకుంది సుందరమ్మ. "ఆఁ! పదో పదకండో అయి వుంటుంది! ఇంకా ఏడెనిమిది గంటలుంది ప్రయాణం. కాసేపు పడుకుంటేసరి!

నిశ్చింతగా గుర్రుపెడుతున్న భర్త వేపు ఓసారి అసూయగా చూసి తలగడా సర్దుకుని పడుకోవడానికి ఉపక్రమించింది.

* * *

మేఘాలేసి యీదరగాలి వీస్తున్నా నర్సయ్యకి చలివెయ్యడంలేదు. ఆనందం ఆవిర్లు ఆవిర్లుగా లేచి వొంట్లోంచి వెలికి వస్తోంది.

"ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?" అన్న ప్రశ్న నర్సయ్యని బాధిస్తోంది. ఆనందం కలిగించే బాధ అది. వూపిరి సల్పుకోనివ్వని బాధ అది.

ఇవాళెంతో మంచిరోజు. బస్సుస్టాండు నుంచి వచ్చి, జట్కా స్టాండుకి వచ్చి, గుర్రానికి గడ్డి పడేసి లైటు వెలుతురులో కుంచున్నాడు. అదృష్టం వెతుక్కుంటూ వచ్చినట్టు చినబాబు వచ్చాడు. క్రిష్ణబాబంటే తనకెంతో యిది. చిన్నప్పట్నించీ తనదగ్గరెంతో చనువు. సాయంత్రమయ్యేటప్పటికి తన జట్కాలో అలాతిప్పి తీసుకు రావలసిందే. బాబుగారింటినుంచి ఎవరెక్కడికి వెళ్ళవలసి వచ్చినా తన జట్కా హాజరు కావలసిందే. పెదబాబుగారు కూడా అడగాల్సిన పనిలేకుండా, కిరాయి యిచ్చేస్తారు కాస్త ఎక్కువే యిస్తారు.

"తీసుకోరా నర్సయ్యా!" అనేవారు.

"ఇదేంటిబాబూ! ఇంతిచ్చేశారేంటి?" అని తనంటే "వుంచుకోరా! పిల్లలు గలాడివి. ధరలు చూద్దామంటే రాకెట్ల లాగా ఆకాశంలోకి వెళుతున్నాయి. వుంచుకో!"

అలాంటి బాబుగారబ్బాయి, క్రిష్ణబాబు తనని వెతుక్కుంటూ వచ్చారు.

"ఒరేయ్ నర్సయ్యా!" అన్నాడు క్రిష్ణబాబు. ఆ కంఠధ్వనికి తను త్రుళ్లిపడి తలెత్తి చూశాడు. "ఏంటిబాబూ! ఇలా వచ్చేశారేంటి?...షికారుకెళ్తారేటి?జట్కా కట్టమంటారా?" అనడిగాడు నర్సయ్య.

క్రిష్ణబాబు నవ్వేశాడు. "షికారుకికాదు తేరా! రేపు ప్రొద్దుటే ప్రయాణం ఏలూరు ట్రయినుకి. అయిదుకల్లా ఇంటికి జట్కా తీసుకుని వచ్చెయ్యి" అన్నాడు.

"ఏంటి బాబూ! ఏంటి కత? అందరూ ఎళ్తున్నారేటి?"పరాచకమాడాడు నర్సయ్య.

"నా పెళ్లిరా నర్సయ్యా! రేపు!" అన్నాడు క్రిష్ణబాబు.

"అబ్బో! పెళ్లి చేసేసుకుంటున్నారన్న మాట. మరి సంజమ్మగోరు రాలా?" అనడిగాడు.

"సంధ్య వాళ్ళాయనతో కలిసి అలాగే వస్తుందట!"

"భలే! చినబాబూ, నా కెంత ఆనందంగా వుందో బాబూ!... మీ ప్రయాణానికి జట్కాకట్టే అదృష్టం కూడా నాదే బాబూ!" అన్నాడు నర్సయ్య.

"అదృష్టం సరేలేవోయ్ రైలు తప్పించెయ్యగలవు! కాస్త ముందుగా వచ్చేయ్! నీ డొక్కు గుర్రం స్టేషను కెళ్లడానికి అరగంటైనా పడ్తుంది!" అన్నాడు క్రిష్ణబాబు.

"అలాగంటారేంటండీ! చూడండి పంచకల్యాణిలాగా ఎళ్తుంది... మరి నాకేటండి బవుమతి?" అనడిగా .

"సర్లేరా! ఎప్పుడూ బహుమతిఅంటూ కూర్చుంటావ్..."

"అదెలాగండి! మేమడగాల! మీరియ్యాల! అందులోనూ, పెళ్లికొడుకుని తీసికెళ్ళే వోణ్ణిగదా..."

"సరే, సరే! చూడు నాన్నగార్ని అడగ మాకు. అయిదు రూపాయ లిస్తాలే...



**వనితలకు మనవి**

కొత్తరకం వంటలు
క్లుప్తంగా వ్రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలు —సం.



**శ్రీమతి మండపాక సుభద్రమూర్తి**

**26-1-1926 :: 19-1-78**

శ్రీమతి సుభద్రమూర్తి (శ్రీ మండపాక శ్రీరామ మూర్తి **Retd Budget Officer TISCO** – గారి ధర్మపత్ని) సాంఘిక సేవా పరాయణురాలు, స్థానిక ఆంధ్ర మహిళాసమితి మాజీ ఉపాధ్యక్షురాలు, ఆంధ్ర నాటక సాహిత్య సంఘ జీవిత సభ్యురాలు, అఖిల భారత మహిళాసమితి (AIWC) సభ్యురాలు, భర్తతో యావద్భారతదేశము, నేపాలు పర్యటించి, అనేక పుణ్యక్షేత్రము లను దర్శించిన వారు, ఆపదలో ఉన్నవారికీ, నిర్భాగ్యులకు అనేకులకు ఉచితరీతిని సహాయము చేసిన వారు, ప్రేమస్వరూపిణి, దైవభక్తురాలు, సుమంగళిగా పింగళనామ సం. పుష్య శుద్ధ ఏకాదశి లక్ష్మీవారం రాత్రి గం. 11 ని 10 లకు మమ్ములను దుఃఖ సముద్రములో ముంచి స్వర్గవాస అయినారు. వారి ఆత్మకు శాంతిని ప్రసాదించ భగవంతుని ప్రార్థించుచున్నాము.

కుమారులు:— మండపాక విశ్వనాథం,
మండపాక భగీరధరావు.
కుమార్తెలు :— శ్రీమతి సోమయాజుల
సత్యకృష్ణ, శ్రీమతి
సరస్వతుల జగత్‌రావు,
కుమారి మండపాక లక్ష్మి.
అల్లుళ్ళు:- సోమయాజులు నరసింహమూర్తి,
H S.C.L., Bhilai
సరస్వతుల వెంకటరావు.
SERly, Waltair R.S. Commercial)

**C/43 B- Biock, Pardesipara,**
Sonari JAMSHEDPUR-831011.

# వెలుగొస్తుంది

ముందుగా వచ్చెయ్యి మరి! మర్చిపోకూ!..'' అంటూ వెళ్ళిపోయాడు క్రిష్ణబాబు.

అబ్బ! అయిదు రూపాయలు! అంటే కనీసం నాలుగు రూపాయలన్నా లాభం! ఏం చెయ్యాలి? ఈ నాలుగు రూపాయలతో ఏం చెయ్యాలి?

కుర్రదానికి పరికిణీ కొనొచ్చు! దానికొక జాకెట్టు గుడ్డ తెచ్చిస్తే? బండి చక్రానికో ఆకు విరిగింది. దాన్ని వేయిస్తే? కుర్రాడికి కొత్త పలక కొనివ్వాలి. వెధవ. వాడు బాగా చదువుకుంటాడు. తనకి జోళ్ళు సరిగాలేవు ఎండల్లో కాళ్ళు మాడుతున్నాయి. అడుగున ఓ టైరుముక్క వేసి, మేకులు కొట్టిస్తే మరో రెండేళ్ళు లాగేయొచ్చు.

ఏదో చేయొచ్చు. ఎన్నయినా చేయొచ్చు. ప్రస్తుతానికి టైముకి జట్కా తీసుకుని బాబుగారింటికి వెళ్లాలి.

అవును, టయిమెంతయి వుంటుందో? సెకండ్ షో విడిచినట్టున్నారు. ఛ! అసలు చుక్కలయినా కనబడకుండా ఆకాశంనిండా మేఘాలు. కాస్త చిన్న కునుకు తీసివేస్తే? అమ్మో, మొద్దునిద్ర పట్టేసిందంటే రైలు తప్పి పోద్ది. చినబాబుగారు చెప్పారు కూడానూ, కాస్త ముందుగా రమ్మని. ఓ చుట్ట కాల్చుకుని లేస్తే నిద్ర ఎగిరి పోతుంది. కాసేపు అటూ యిటూ చూస్తే అయిదయి పోతుంది. కిరాయికి వెళ్లొస్తే అయిదు రూపాయలు చేతిలో పడతాయి. వాటితో ఏంచేయాలన్నదీ తర్వాత ఆలోచించొచ్చు.

ఆనందంతో చుట్ట తీసి, ముట్టించి, గుప్పు గుప్పున పొగ వదిలాడు నర్సయ్య.

*　*　*

పైన నర్దుకుంటున్న కృష్ణారావు "బాబుగారూ!" అన్న పిలుపు విని వీధి తలుపు దగ్గరి కెళ్లాడు.

ప్రయాణానికి సిద్ధమై సుందరమ్మ కూడా అదరాబాదరాగా అటువేపొచ్చింది.

"అరే! అప్పుడే లేచి సిద్ధమై పోయావేమిటోయ్! ఇంకా లేపుదామనుకుంటున్నాను!' అందామె.

"ఎందుకోనరిగా నిద్ర పట్టలేదమ్మా!" సిగ్గు పడుతూ అన్నాడు కృష్ణారావు.

ఆ మాటలకి సుందరమ్మ "అవును! నాకూ ఎందుకో నిద్రబట్టలేదు... అయినా ప్రయాణం ముందుంచుకుని నిద్ర పోవడ మెలా?'' అంది.

కృష్ణారావు "అదే, అదే! నాకూ అందుకే నిద్ర పట్టలేదు!'' అన్నాడు, తన మానసిక పరిస్థితిని దాచుకునే అవకాశం వచ్చినందుకు సంతోషిస్తూ.

''నర్సయ్య వచ్చేసినట్టున్నాడా కృష్ణా! చూశావా! వేళైపోయిందన్నమాట! మీ నాన్నగారింకా నిద్ర లేవలేదు. నువ్వు వెళ్ళి ఆయన్ని నిద్ర లేపు! నేను తలుపు తీసి సామాన్లు జట్కాలో పెట్టిస్తాను''అందామె.

కృష్ణారావు యింటో కెళ్లాడు.

''టైమెంతయిందిరా నర్సయ్యా?'' అని అడిగింది సుందరమ్మ తలుపు తీసి.

"తెలీదమ్మగారూ. అయిదయి వుంటుంది. యింతట్లోనే వెలుగొచ్చేస్తుంది!'' అన్నాడు నర్సయ్య.

''సామాన్లు తీసుకొచ్చి జట్కాలో సర్దు!'' అని వాడికి పురమాయించి, సుందరమ్మ యింట్లోకెళ్ళింది. గదిలోకి

# ఆంధ్రలో ఎన్నికలొచ్చాయి!

ఆంధ్రప్రదేశ్‌లో స్త్రీ వోటర్లు 1,42,75,524 మంది వున్నారు. పురుష వోటర్లు 1,40,50,950 మంది వున్నారు. మొత్తము అసెంబ్లీ నియోజక వర్గాలు 294. మొత్తము పోలింగు కేంద్రాలు 37,300.

*　*　*

తూర్పు గోదావరిజిల్లాలో వోటర్లు, అసెంబ్లీ నియోజక వర్గాలు, పోలింగు కేంద్రాలు సంఖ్య మన రాష్ట్రంలో అన్ని జిల్లాలకన్నా ఎక్కువ. ఈ జిల్లాలో 20,43,713 మంది వోటర్లు వున్నారు. 21 అసెంబ్లీ నియోజకవర్గాలున్నాయి. 2697 పోలింగు కేంద్రాలు ఏర్పాటైనాయి.

*　*　*

ఆదిలాబాదు జిల్లాలో వోటర్లు చాలా తక్కువ. పోలింగు కేంద్రాలు మన రాష్ట్రంలో అన్ని జిల్లాలకన్నా అంచేత తక్కువ. ఈ జిల్లాలో 7,60,023 మంది వోటర్లు వున్నారు. పోలింగు కేంద్రాలు 1,015 వున్నాయి. తక్కువ నియోజకవర్గాలువున్న మూడు జిల్లాలు ఆదిలాబాద్, నిజామాబాద్, ఖమ్మం. ఈ మూడు జిల్లాలలో ఒక్కొక్కచోట్ల 9 చొప్పున మాత్రమే అసెంబ్లీ నియోజకవర్గాలు వున్నాయి.

[ సేకరణ : ప్రసాద్ ]

## మీకు తెలుసా?

★ మానవేతిహాస చరిత్రలో చిన్నవి పెద్దవి అన్నీ కలిపి 14 వేల యుద్ధాలు జరిగాయి. ఈ యుద్ధాలవల్ల దాదాపుగా 4 వేల మిలియన్‌ల జన నష్టం జరిగింది. ఇది ప్రస్తుత ప్రపంచ జనాభాకు దాదాపుగా సమానం.

★ మొదటి ప్రపంచ యుద్ధంలో 9.5 మిలియన్‌ల మంది నిహతులయ్యారు. 20 మిలియన్‌ల మంది క్షతగాత్రులయ్యారు. ఈ యుద్ధానికైన ఖర్చు మొత్తం 359, 900 మిలియన్ల డాలర్లు 58 మిలియన్ల డాలర్ల విలువగల ఆస్తినష్టం సంభవించింది.

★ రెండవ ప్రపంచ యుద్ధలో సంభవించిన జన నష్టం 50–55 మిలియన్ల మంది. ఇందులో 27 మిలియన్ల మంది యుద్ధ రంగంలో మరణించారు యుద్ధాన్ని ప్రారంభించిన దేశాలు సైనిక ఖర్చులు, సంభవించిన యుద్ధ నష్టాల మొత్తం విలువ 40 లకల మిలియన్ల డాలర్లు.

★ 50–60 దశకాల్లో ప్రపంచ సైనిక ఖర్చుల మొత్తం 20,00,000 మిలియన్ డాలర్లు. 1976 లో అంచనాల ప్రకారం ప్రపంచ దేశాలు సైనికావసరాల మీద పెట్టిన ఖర్చుల మొత్తం 3,80,000 మిలియన్ డాలర్లు. గత దశాబ్దంగా యీ ఖర్చులు సగటున 2.5 శాతం చొప్పున పెరుగుతున్నాయి.

★ ఒక ఆధునిక అణు విమాన వాహక నౌక నిర్మించడానికి షుమారుగా 5 వేల మిలియన్ల డాలర్లు ఖర్చు అవుతుంది ఒక అణు క్రూయిజర్ నిర్మించడానికి అయ్యే ఖర్చు వెయ్యి మిలియన్ల డాలర్లు, అణు జలాంతర్గామి నిర్మించడానికి వెయ్యి మిలియన్ల డాలర్లు, ఒక క్రూయిజ్ మిస్సైలు తయారు చేయడానికి **ఒక** మిలియన్ డాలర్లు ఖర్చవుతుందని అంచనా.

— సేకరణ: వసంత.

---

ఎప్పి భర్తని చూసి "అయ్యో రామా! మీరింకా లేవనేలేదా? సర్వయ్య కూడా వచ్చేశాడు జట్కా తీసుకుని!" అంది.

"ఏవిటే!" అని మూలిగాడాయన.

"ఏవిటేవిటి! లేచి ముఖం కడుక్కొని కాఫీ తాగండి. జట్కా వచ్చేసింది...ఏరా! కృష్ణా! టయిమెంత యింది?" అనడిగింది.

"టైంపీస్ ఆగిపోయిందమ్మా! కీ యివ్వలేదుగామోను!" అన్నాడు కృష్ణ.

ఇంటి యజమాని తాపిగా లేచి కూర్చున్నాడు. ఏవిటే యీ గోల అర్ధరాత్రి అంకాళమ్మ సివాలు అన్నట్లు అన్నాడు విసుగ్గా.

"అవునవును మీ కలాగే వుంటుంది... అయిదయిపోయి వుంటుందన్నాడు సర్వయ్య. ఇప్పటికైనా లేచి త్వరగా తెమలండి. లేకుంటే ఆనక అవస్థ పడాల్సి వస్తుంది!" అంది పెడసరంగా సుందరమ్మ.

"ఏవిటేవిటీ? అయిదయిందా! విచిత్రంగా వుందే!" అన్నాడాయన తాళాల కోసం జేబులు తడుముకుంటూ.

"మీ కన్నీ విచిత్రంగానే వుంటాయ్. ముందు లేవండి!" అంది.

"అదికాదే! అయిదయితే నాకు తప్పకుండా మెలకువ వస్తుంది!" అన్నాడాయన అలమారా తాళం తీస్తూ.

"అవునవును. మెలకువ వస్తుంది. కానీ యివాళ వూరికెళ్తున్నాంగా! అందుకని మీకు మెలకువ రాలేదు!" అందామె.

ఆయన అలమారా తెరచి, దానిలోకి చూసి, గట్టిగా నవ్వాడు. ఒక నిముషం పాటు అలా నవ్వుతూనే వున్నాడు.

"ఏంటండీ! ఆ నవ్వు! దయ్యంపట్టినట్టు. చుట్టుపక్కల యిళ్లవాళ్ళని కూడా లేపేస్తారాయేం!" అంది కోపంగా, సామాన్లు సర్వయ్యకి అందిస్తూ.

ఆయన సంబాళించుకుని "చూడు, సుందరం! నువివాళ ఏమైనా కాస్త కునుకు తీశావా?" అనడిగాడు.

"బాగనేవుంది మీ ధోరణి ఒక పక్క ప్రయాణం, ఒక ప్రక్క గుర్రుకొట్టి మీరు నిద్రపోవడం, ఒక పక్క అన్ని సామాన్లు సర్దానో లేదో అనే ఆందోళన..."

"అంచేత నిద్రపోలేదంటావు అవునా?"

"నాకు మీలాగా నిద్రపోవడం రాదు! ఎన్ని పనులున్నా మొద్దులాగా నిద్రపోవడం నాకు రాదు సుమా" అందామె కోపంగా.

ఆయన నవ్వాడు. "అవునవును! నాకు తెలియదు గనకనా!...ఒరే! కృష్ణా! నువ్వైనా ఏమన్నా నిద్రపోయావ్రటా!"

"నేను, నేను..." అని నీళ్ళు నమిలాడు కృష్ణారావు.

"అవున్లే! కోరుకున్న అమ్మాయిని పెళ్ళి జేసుకుంటున్నాననే సంతోషంతో నీకు నిద్ర పట్టలేదు, ఆశించిన కట్నం అందుతుందని మీ అమ్మకి నిద్ర పట్టలేదు... ఇంతకీ యిప్పుడు టైమెంతయిందో తెలుసా?" వాచీని చేతిలో పట్టుకుని అడిగాడాయన.

తల్లీ కొడుకూ, మౌనంగా వున్నారు.

"చూడండి, యిప్పుడు సుమారా పది అయింది ఇప్పట్నించే వెళ్ళి స్టేషన్లో కూర్చుంటారేమిటి?" అనడిగాడు ఆయన మళ్ళీ పగలబడి నవ్వుతూ.

"చాల్లెండి మీ వెటకారాలూ మీరూనూ. ప్రయాణం ఆందోళనతో వుంటే ఎవరికైనా అలాగే వుంటుంది. అందరూ మీలాగే వుండరు దండొస్తుంది అంటే పండుకు తిని వెళ్దామనే రకం!" అని దెప్పింది సుందరమ్మ.

"అదికాదు నాన్నా... మరి, మరి... సర్వయ్య... వాడుకూడా వచ్చేశాడే! వాడెందుకు నిద్రపోలేదంటావ్? నీ టైము తప్పేమో!" అన్నాడు కృష్ణ.

"ఒరే అబ్బాయ్ సూర్యుడు ఆలస్యంగా వుదయించొచ్చు. నక్షత్రాలు గతులు తప్పవచ్చు కాని నా గడియారం వుందే... అది తెల్లోడు యిచ్చిందిరా! నా సర్వీసుకి మెచ్చి నాకు బహుమతి యిచ్చాడు. అది మాత్రం తప్పదు... ఇక సర్వయ్య సంగతంటావా? వాడికీ ఏదో డబ్బు ఆశ చూపించివుంటావు వాడి బహుమతి సంబరంలో వాడికీ నిద్ర పట్టి వుండదు. అంతేనా సర్వయ్యా?" అనడిగాడాయన అప్పుడే యింట్లోకొచ్చిన సర్వయ్యను.

"అంతేబాబూ! ఇంతట్లోనే ఎలుగొచ్చేస్తుందండీ!" అన్నాడు సర్వయ్య

ఆకాశంలో నక్షత్రాల్లాగా ఆ యింట్లో నవ్వులు విరిశాయి.




# మరి, మీకెలా కనబడుతోందీ లోకం?

మల్లాప్రగడ రామారావు

**'మంచి'** అన్నది లోకంలో లేదని నా నిఖార్సయిన అభిప్రాయం. ఈ అభిప్రాయానికి ప్రాతిపదిక ఏమిటా అని నే నెప్పుడూ ఆలోచించలేదు. ఐతే అనాలోచితంగానే నాకు నేను అర్థమవడం జరిగింది. అదెలా జరిగిందీ అంటె... అవి చెప్పేందుకే యీ కథ.

ఎండవేళ ఓ మధ్యాహ్నం ఉస్సురను కుంటూ ఆ ఊళ్ళో బస్సు దిగాను అక్కడికి మా ఊరు సుమారు ఆరు ఫర్లాంగుల దూరం.

పేరుకి మా వూరే గాని అక్కడ నేను పుట్టాలేదు, పెరగాలేదు. అంతెందుకు ? నాకు పద్దెనిమిదేళ్ళు నిండేవరకూ నేనా వూరే పోలేదు.

మరి మా ఊరెందు కయ్యిందీ అంటే మా కక్కడ పొలాలున్నాయి. చెరువుగట్టు నుంచీ, బోడిమెట్ట వరకూ భూములన్నీ మావేనుట. ఇప్పుడు కాదనుకోండి. మా పూర్వీకుల హయాంలో.

మా తాతగారి కాలం నాటికే మేం పట్నం తరలి వచ్చేసాం. ఏటా వో రెండు నెల్లు ఆ ఊర్లో మకాం వెయ్యడం కుప్పలు నూర్పించి 'మగతా' కొలిపించుకోడం. ఆ వూరికీ, మాకూ వున్న సంబంధ మల్లా అదొక్కటే !

కారణాలేవయితేనేం మా నాన్నగారి తరాని కొచ్చేసరికి వో పన్నెండెకరాల పొలం మాత్రం మిగిలింది. మళ్ళీ అందులో కొంత 'ఓగ బందా'లో వుంది.

వెళ్ళాల్సియింది– నాన్నగారు నేనూ వూరు వెళ్ళి. ఇంకా కుప్పలు నూర్పలేదుట. పట్నంలో నాకేమో డబ్బు యిబ్బంది లావయింది.

దగ్గరుండి కుప్ప నూర్పించి, ధాన్యం లమ్మించి, కొంతయినా సొమ్ము తీసికెళ్దా మని ప్రయాణం పెట్టుకున్నాను.

'ఎయిర్ బాగ్' ఊపుకుంటూ గొర్జిదారి పట్టాను. ఎప్రిల్ అని ఎండకు యిసుకమండుతూ వుండాలి. కాని దారినిపోయే వాళ్ళలో, ఒక రిద్దరికి తప్పించి, ఎవరికీ చెప్పుల్లేవు. పాతదో. చింకిదో గుడ్డముక్క కట్టుకుని. భుజాన గుడ్డ వేసుకుని నడుస్తున్నారు చాలామంది.

గొర్జి కిరుప్రైపులా చేను కొయ్యగా మొదళ్ళు మాత్రమే మిగిలివున్న పొలాలు. పొలం గట్లంట మేస్తున్న పశువుల్నికాపలా కాస్తున్న 'సొమ్ముల కుంటలు'. అక్కడక్కడా 'హో' మని కేకలువేస్తూ పోతున్న అదమాయిస్తూ, కళ్ళొప్పచేసుమీట్టిస్తున్న పాలేళ్ళు.

అన్నీ చూసుకుంటూ చెరువు గట్టె క్కాను. అక్కడనుంచీ మా వూరు కొంచెం కనబడుతుంది– నాయుడుగారి మామిడి తోట వెనకాల్నుంచి.

చెరువునిండా నీటిని కప్పేస్తూ తామరాకులు. నీటిలో యీదుతూ వెళ్తున్నారు కొందరు తామరతూళ్ళకోసం. అక్కడే చాకి రేవు.

పీపు బాటవేపు వుంచి, వయసు నిండా రాని చాకలిపిల్ల ఎవరిదో ఉతికిన 'బ్రాసరీ' రాడుక్కుంటోంది. గూనల్లోంచి వస్తున్న పొగ ఆమెచుట్టూ అల్లుకుంటోంది.

గట్టు దిగువన. ఉలిమీద సుత్తివుంచి, 'పిక్కకోసం మందుపెట్టి' పేల్చిన మెట్ట రాళ్ళను కొడుతున్న వంగిన శరీరాల మీది చెమట బిందువులు ఎండలో తళతళలాడుతున్నాయి.

పొలంగట్టు పట్టాను. తిన్నగావెళ్తే మర్రిచెట్టువస్తుంది. దాన్నానుకునే నాయుడుగారి కళ్ళం. ఆ ప్రక్కనుంచి ఊర్లోకి దారి.

నోట్లో చుట్టపెట్టుకొని చెట్టుకింద కూర్చున్న దండాసి అంకమ్మ చుట్టతీసి పలకరించింది. క్షణం చెట్టుక్రింద నిల్చుని పరిశీలనగా ఊరిహోసారి చూసాను. అన్నాళ్ళ క్రిందట ఎలావుందో యిప్పుడూ అలానే వుంది.

ఊరి మొదట మాలపేట. ఒకదాన్నొ

క్కటి అంటిపెట్టుకుని, నేలని కరుచుకుని వున్న గుడిసెలు కొంచెం ఎడం ఆ వాసనే త్రోవకు రెండువేపులా సంసారులయిళ్ళు, పూరిళ్ళు.

మాలవాళ్ళ గడపలో పాతిక. రైతువారి యిళ్లో యాభై. కోమటిదుకాణం. ఊరి మంగలిదొకటి, కంసాలులలో నాలుగైదు పూరిళ్ళుకలసి మావూరయ్యాయి.

మరచిపోరాను వూరిమధ్యగా దిబ్బ మీద కూలిపోతున్న ఏకోపాధ్యాయ ప్రాథమిక పాఠశాల—సర్కారువారిది వుంది.

ఊరంతటికీ మునుపొక్కటే పెంకుటిల్లుండేది నాయుడుగారిది. మేం ఎప్పుడిక్కడికొచ్చినా వారియింట్లోని గదే ఒకటి కేటాయిసారు ఇప్పుడా పెంకుటిల్లు డాబా అయింది. వరసగా వున్న పూరిళ్ళమధ్య మరో పెంకుటిల్లు లేచింది. నేను గుర్తించిన మార్పులివే.

పశువులసాల ప్రక్కనుంచి నాయుడిగారింటివేపు నడిచాను నా పంట్లాం, బుష్ షర్ట్లవేపు, చేతిలోని బ్యాగ్ వేపు పరిశీలనగా చూస్తూ, 'బాగున్నావా ?' 'ఇదే నేటి రావడం' 'ఎండ పడొచ్చినావు. బేగి యింట్లోకెల్లు' అంటూ పలకరిస్తున్న వారికి సమాధానంగా చిరునవ్వు నవ్వుతూ మెట్లెక్కి తలుపు తట్టేను.

అమ్మ తలుపు తీసింది. కుశల ప్రశ్నలు కాగానే, వచ్చిన పని చెప్పి, మాటల్లో పడ్డాం.

సాయంకాలమవుతుంటే అలా ఏటి వేపు బయల్దేరాను ఎప్పుడోకాని యీ వూరు రాను. ఎప్పుడొచ్చినా వెంటనే వెళ్ళిపోవాలనుంటుంది.

ఆ మనుషులు, వారి దరిద్రం, అవరి శుభ్రత, అన్నీ చికాకు కల్గిస్తాయి.

ఊరిమధ్య పునాదుల వరకూ లేచి ఆగిపోయిన రామాలయం, రాజకీయస్వాతంత్ర్యం సంపాదించి చేతులు కడుక్కున్న దేశాన్ని జ్ఞప్తికి తెస్తుంటుంది.

తప్పేము ఈ వ్యవస్థ బద్దలు కావలసిందే అనుకుంటూ నడిచాను. లేకుంటే గోచిపాత కట్టుకుని, నెత్తిన జంగిడి పెట్టుకొచ్చిన కోమటి వైకుంఠం అప్పుడే అయిదెకరాల భూమి సంపాదించడ మేమిటి, రెక్కలు ముక్కలు చేసుకుని, తాత ముత్తాతల నుండి భూమిని సాగు చేస్తున్న 'హరిజనులు' తమకు కేటాయింపైన బంజర్లును కూడా లోపాయికారీగా అమ్ముకోవడ మేమిటి ?

కాడి ఏనాడు పట్టుకోని నాయుడిగారి కళ్ళం ఒత్తుగావేసిన కుప్పలతో పునిస్త్రీ ముఖంలో కళకళ లాడుతూవుండగా, ఒళ్ళు విరుచుకు పనిచేసే వారికంగార్లు కూటికి సరిపడా ధాన్యమైనా ఎరగకపోవడమేమిటి ?

ఏటిలో నీరు పాదాలుమునిగే మాత్రమే వుంది. ఏటిఒడ్డున పనసతోట — అప్పుడెప్పుడో మా దేనుట — కాపుకివస్తోంది. ఆకాశం ఎఱుపుకోల్పోయి, చీకటిచాపక్రింద నీరులావస్తుంటే యింటిదారిపట్టాను.

తెల్లారితే కుప్పనూర్పించి సాయంకాలానికి డబ్బు జతపరుస్తానన్నారు నాన్నగారు. ఆ గాకరకాయకూర, కొత్తిమిరిచారు, చిక్కని మజ్జిగలతో అమ్మపెట్టిన వేడివేడి అన్నం కడుపునిండాతిని నిశ్చింతగా పడుకున్నాను.

తొందర తొందరగా మనుష్యులు వరిగెడుతున్న ధ్వని. గాభరాగా వేస్తున్న కేకలు. 'ఏం జరిగిందా' అన్నభయంతో ఒక్కసారి మెలకువ వచ్చేసింది.

'నాయుడుగారి కళ్ళంలో కుప్పలంటుకున్నాయట్రా నాయనా !' అంది అమ్మ — భయం, ఆదుర్దా నిండిన గొంతుతో. వీధి అరుగు మీద ఖాళీగావున్న మంచం చూసి నాన్నగారప్పుడే అక్కడికి వెళ్లేరనుకున్నాను. చీకటిలో తడువుకుంటూ మెట్లు దిగేను.

ఎంతరాత్రయిందో తెలియదు. ఆకాశంలో ఒకటీ అరా నక్షత్రాలు మిణుకు మిణుకుమంటున్నాయి. ఏ మబ్బుచాటున దక్కున్నాడో చంద్రుడు అయిపులేడు. శీత వాయువుమాత్రం వీస్తోంది.

ఊరికి దాపునే నాయుడుగారి కళ్ళం. నిదానంగా అడుగులేస్తూ నడిచాను. కళ్ళం చుట్టూ చెట్లు. కాలుతున్న కుప్పల్నుంచి ఎఱ్ఱని మంటలు లేస్తున్నాయి. తెల్లని పొగ దట్టంగా అంతటా ఆవరించి వుంది.

అంతా హడావుడి పడుతున్నారు. టార్చిలైటు నాలుగు మూలలకివేస్తూ నాయుడు చెప్తున్నాడు: ఇక్కడే మంచం వాల్చుకు పడుకున్నాను. ఎందుకో మెలకువ వచ్చి చూస్తే కుప్పదగ్గర అలికిడయింది.'ఎవ్వరా అది ?' అని కేకేస్తే జవాబు లేదు. టార్చి తీద్దామనివంగేను. మనిషి పరిగెత్తిన శబ్దం. అటుకేసి పరిగెత్తబోయేసరికి కుప్ప కాలిన వాసన వేసింది. వెంటనే అప్పిగాడిని భీముణ్ణి అందరినీ లేపాను.' అంతలోనే కాలుతున్న కుప్పనంకనిస్సహాయంగా చూస్తూ కేకలేస్తున్నాడునాయుడు 'అనంజికొడుకులు మాలోళ్ళని లేపండ్రా. తొంగున్నారిల్లల్లో. పరిగెత్తికెళ్ళి బట్టిలోంచి నీరుతెండి' అని.

నిప్పు. నిప్పు ఆర్పాలంటే నీరు కావాలి. ఊరికి దూరంగా వుంది నుయ్యి. అంతకంటే దగ్గరగా ఏటినుంచి తీసిన పంట కాలువ పారుతోంది కడవలు పట్టుకు పరిగెట్టారటు వేపు కొందరు.

కొందరు మండుతున్న కట్టల్ని లాగి దూరంగా విసిరేస్తున్నారు. చేతులతో వాటి మీద దబదబా బాది మంట ఆర్పాలని చూస్తున్నారు.

అంతటా కలియదిరిగి, అందరినీ గదమాయించడమేగాని, తానుగా మంటనార్ప ఏ ప్రయత్నమూచెయ్యని నాయుడి వేపు చూస్తూ ఎడంగా నిల్చున్నాను— అతనికి లేని బాధ నా కెందుకని.

వెంకన్న వాడి కుటుంబం, మరికొద్ది మంది మినహా హరిజనులెవరూ మంటలార్పడానికి రాకపోవడం తలచుకుంటే మహ ముచ్చటేసింది నాకు. అర్పనీ నాయుడు. మిగతా నాయుళ్ళంతా మంట నార్పాలని అటూ, యిటూ, పరిగెత్తనీ. మాలవాళ్లెందుకు రావాలి ? ఏడాది పొడుగునా ఒళ్ళు మన్ను చేసుకుని కుప్పలు పేర్చి గాదెలు నింపింది చాలక ఉత్త పుణ్యానికి ఒళ్లు కాల్చుకోవాలా ? వాళ్లంతా నిశ్శబ్దంగా వినిపించిన విప్లవ శంఖంలా తోచింది నాకది.

అప్పుడు చూసాను. మంటల వెలుగులో ఆయన ముఖం ఉద్రేకంతో మెరుస్తోంది. కట్టుకున్న తెల్ల మల్లు పంచె ఎగ్గట్టి, పొడుగు చేతుల తెల్ల చొక్కా విసురుగా విప్పేసి, యజ్ఞోపవీతం వెన్నుమీద తెల్లని చారలా వుండగా కుప్ప ఎక్కుతున్న మాష్టార్ని.

తరవాత ఓ పదిహేన్నిమిషాలు అంతటా ఆయన్నే చూసాను, బట్టికి పరిగెట్టి నీళ్లు మోసుకువస్తూ, కుప్పల మీదకి నీళ్లందిస్తూ, మంటల్ని కుప్పలెక్కి ఆర్పాలని యత్నిస్తూ, కూడా వున్న వారిని హెచ్చరించి ప్రోత్సహిస్తూ, నలుదిశలా ఆయనే !

ఆయన ప్రతిచర్య వికృతంగా వుంది






## మరి, ఏకాకెలా కనబడుతోంది లోకం

బలహీనమైన శరీరం, అలవాటు లేని, చేతకాని పనులు చేస్తూ వుండడం వలన వచ్చిన వికృతత్వమది. అసహ్యం వేసింది. 'ఈ బ్రాహ్మడు— సింగిల్ స్కూల్ టీచర్ —నాయుడుగారి ప్రాపుకోసం ఎంత అవస్థ పడుతున్నాడురా' అని వెంటనే తిరిగి యింటి కొచ్చేసాను.

మనసు చిరాకుగావుంది. అధికారం, ఐశ్వర్యం పాదాలునాకే జాతి మనదనిపించింది.

ఉదయాన్నే తెలివొచ్చింది. ఇంకా యింట్లో ఎవరూ లేచినట్టులేదు. చెంబు పట్టుకుని ఏటివేపువెళ్తుంటే త్రోవలో ఎదురయ్యారు మాష్టారు. ముఖానపిండి కట్లు. తడిపంచభుజంమీద చేతిలోవున్న రాగిచెంబుతో నీళ్ళు. ఏటినుంచి స్నానంచేసి వస్తున్నట్టున్నారు.

తప్పుకు పోదామన్నా కుదిరింది కాదు. కాళ్ళు ఎత్తెత్తివేస్తూ 'ఉస్ ఉస్' అను కుంటూ నడుస్తున్నారు. చేతిలో బొబ్బలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ముఖాన కొత్తగా కాలినగుర్తొకటి ఎడంకాలి వేళ్ళు రెండింటికి గుడ్డముక్క చుట్టివుంది. దాని మీద రక్తంమరకలు. 'తగినపనయింద'ను కున్నాను.

'నాన్నగారు చెప్పారు నువ్వొచ్చావని. చూసావా ఆఖరికెలాఅయిందో ఇవాళ తొలి ఝామున ఆరంభించుదామనుకున్నాడు వెంకన్న నూర్పు. సాయంకాలానికి గాలిపట్టి బస్తాలకెక్కించి, వైకుంఠం దుకాణానికి వప్పచెప్పి డబ్బు నీకిద్దామనుకొన్నారు నాన్నగారు. ఏ క్షణాని కేమవుతుందో చెప్పలేం!'

మాలవెంకడే మా పొలాన్ని మగతాకి సాగు చేస్తున్నాడు. అప్పుడు గుర్తొచ్చింది నాకు. మావూర్లో మాకు పొలమే కాని కళ్ళంలేదు. ఎప్పుడొచ్చినా నాయుడుగారింటో దిగినట్టే, ప్రతిఏటా పంట వారికళ్ళంలోనే నూరుస్తాడు వెంకన్న.

నాగుండె బేజారైంది. స్కెచ్‌లాన్ పెంటింగ్స్ రెండుతీసుకున్నాను. వాటికి సరిపడే యింపోర్టెడ్ షర్టింగ్స్ సంపాదించి వుంచుకున్నాను. అన్నిటికంటేముఖ్యం ఏడాది పొడుగునా జీతం సరిపడక చేసిన అప్పులు తీర్చాలి.

నా ముఖంలో మారిన రంగుల్ని చూసి నట్టున్నారు మాష్టారు.

'నీకేం పరవాలేదులే! మిగతా కుప్పలు నూర్పించి వెంకడిచేత మగతా కొలిపిస్తారు నాయుడుగారు. ఒకటో, రెండో పుట్లు తక్కువైతే అవుతాయుంతే ?

నాకు ధైర్యం వచ్చింది ఆ మాటంతో పంటపోయినా; కుప్పకాలినా, వెంకన్న మా మగతా కొలవాల్సిందే. ఏమన్నా పేచీపెట్టినా నాయుడుగారున్నారు.

'వేసంగి వచ్చేస్తోంది కుప్పలెట్టి పెట్టకురా అంటే విన్నాడుకాదు ఆ వెంకన్న. ఏడాది పొడవునా పెళ్ళాం పిల్లలతో ఏం తిప్పలు పడతాడో...' అంటూ వెళ్ళి పోయారు మాష్టారు. అంతవరకూ నాకి ఊహే రాలేదు!

'ఈ భూమి పగిలి నన్ను తనలో యిముడ్చుకుంటే బాగుణ్ను' అని మగ వాళ్ళకి అనిపించే క్షణం ఒకటి వుంటే నా జీవితంలో ఆ క్షణం అలాంటిది.

అప్పుడు అకస్మాత్తుగా నాకు నేను బోధపడ్డాను.

నిన్నరాత్రి మంటలార్పడానికిరాని వెంకడి కులస్థులూ బోధపడ్డారు. ఎటొచ్చీ బోధ పడనిది మాష్టారే. ఏదో ఒక 'మోటివ్' లేని మంచితనం వుంటుందని నేనెప్పుడూ అనుకోలేదు.

లోకంలో మంచి అన్నది లేదని నా నిఖార్సయిన అభిప్రాయం. ఎందుకంటే నాలో ఆ మంచితనం లేదు కాబట్టి. నా మంచితనం మీద నాకే నమ్మకం లేక పోబట్టే — అని ఆ రోజు ఉదయం అలాగ తెలిసింది నాకు.

# ఫాలాక్షుని డైరీ

## రైలు పెట్టెల వేలం!

ఫ్రాన్సులో అతివేగమైన రైలు ఓరియంట్ ఎక్స్‌ప్రెస్‌ను యిటీవల రద్దు చేశారట. ఆ రైలు పెట్టెలలో రెంటిని యిద్దరు ధనికులు వేలంపాటలో నాలుగున్నర లక్షల డాలర్లకు గెలుచుకుని చక్కాపోయారట. వేలంవెర్రంటే అదేకదా!

## మొట్ట మొదటి నీగ్రో న్యాయమూర్తి

దక్షిణ ఆఫ్రికాలో మొట్టమొదటిసారిగా ఒక నీగ్రో న్యాయమూర్తిగా నియమింపబడ్డారట. ఈ విషయం అక్కడ చాలా వేడివార్తట. వాటేజిస్సుని దక్షిణాఫ్రికా అంతా ముక్కున వేలేసుకొని చూస్తోందట.

## ప్రమాదానికి దారి తీసిన పట్టరాని సంతోషం

నామగిరిపేట అనే వూరుకు చెందిన సుబ్రమణ్యం అనే అతని భార్య సంక్రాంతి పండుగకు తన పుట్టింటి నుంచి కొత్త బట్టలు తెచ్చిందట. దాంతో సుబ్రమణ్యం బ్రహ్మానందపడి, సినిమాకి వెళ్దాం పదమని, ఆమెను కొడుకును హాలువద్ద తనకోసం ఎదురు చూస్తూండమని ముందు పంపేసి తను రూమాన్మని సైకిలెక్కి కొత్తబట్టలు వూళ్ళో తెలిసిన వారికి, స్నేహితులకు చూపి, ఆనక వేగంగా హాలువైపు వెళ్తుండగా ఎదుర్లో లారీవచ్చి అతన్ని గుద్దేసి పొట్టన పెట్టుకుందట. సుబ్రమణ్యం తల ముక్కలై మెదడు బయట కొచ్చేసిందట.

## అమెరికా అధ్యక్షుని సోదరి ఆర్భాటం!

వాషింగ్టన్‌లో వ్యవసాయదారులు తమ పంటను అమ్మేధర ప్రభుత్వమే నిర్ణయించిందట. ఆ ధర చాల తక్కువని గిట్టుబాటుకాదని వ్యవసాయదారులందరూ వైట్‌హౌస్ ముందు తమ తమ ట్రాక్టర్లను బారులు బారులుగా నిలిపి ఆర్భాటం ఆరంభించారట. ఈ ఆర్భాటం అమెరికా ప్రెసిడెంట్ కార్టరుకు పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయిందట. ఆ వ్యవసాయదారులలో ఆయన చెల్లెలు గ్లోరియాకార్టరు వున్నదట. ఆమె ఆర్భాటమే ఎక్కువగా వున్నదట.

## బిషప్ కారుపై దాడి

దక్షిణ ఇండియా క్రైస్తవ మఠాధిపతి ఆనందరావు సామువేలు అనే బిషప్ తూర్పు పశ్చిమగోదావరి కృష్ణాజిల్లాలకు సంబంధించిన చర్చి ఆదాయ వ్యయాలను విజయవాడలోని ఆఫీసు రికార్డులను తనిఖీచేస్తే లక్షా అరవైవేయేడువేల రూపాయలు మోసం తేలిందట. దానివల్ల సెక్రటరీని క్యాషియరును వుద్యోగంలోంచి తీసి వారిమీద పోలీసుకు రిపోర్టు యిచ్చి తాను తన భార్య ఫ్లోరాతో కారులో తిరిగి వెళ్లార్లు వెళ్తుండగా దారిలో కొంతమంది ఆయన కారును ఆపి ఆ కారుమీద పెట్రోలుపోసి నిప్పంటించేశారట. భార్యాభర్తలిద్దరూ ప్రమాద స్థితిలో వెల్లూరు సి. యం. సి. ఆసుపత్రిలో చేర్చబడ్డారట. బిషప్‌కు మాత్రం గండం గడిచిందట. ఆయన భార్య ఫ్లోరా చనిపోయిందట.

## వెర్రితెచ్చిన తంటా!

సేంద మంగలంకు చెందిన జానకి అనే ఆమె సంక్రాంతి పండుగకు ఇంటికి వెళ్లి వేద్దామా అని భర్త కందసామిని అడిగిందట. వెళ్లాలేదు గిళ్లాలేదు డబ్బులేదు పొమ్మన్నాడట. దాంతో యిద్దరూ తనివితీరా పోట్లాడుకున్నారట. జానకి వో ఇటిక ముక్క భర్తమీద విసిరితే అదెళ్ళి అతని దవడకు బలంగా తగిలిందట. దాంతో కందసామికి కళ్ళు బైర్లుగమ్మి కోపంవచ్చి ఆ రాత్రి నిద్రపోతున్న జానకిని పదమూడు ముక్కలుగా కత్తితో నరికి పోలీస్టేషనుకు వెళ్ళి విషయం చెప్పి లొంగిపోయాడట.

## సార్థక నామధేయుడు!

తమిళనాడు లాటరీలో కోయంబత్తూరుకు చెందిన 41 ఏళ్ళ అమీర్ అనే ఆటోరిక్షా డ్రయివరుకు అయిదులక్షల రూపాయలు వచ్చిందట. ఇతనికి ఇద్దరాడపిల్లలు ఇద్దరు మగపిల్లలు లాట. గరీబుగా వున్న అమీర్ యీ దెబ్బలో సార్థకనామధేయుడయ్యాడన్న మాట — ఆమా! అప్పడిసాల్!

## భూమితగాదా కారణంగా దారుణ హత్యలు

వెణ్ణందూరు వడకం పాళయానికి చెందిన 43 ఏళ్ల పళని వేలు అనే అతనికి, అదే వూరుకు చెందిన ముత్తు అనే అతనికి భూమికి సంబంధించిన తగాదాలతో పచ్చగడ్డి వేసే కూడా ఇద్దరి మధ్యా భగ్గుమనేదట, ముత్తు ఇంటిమీద ప్రతిరాత్రి రాళ్ళు పడేవట. ఇది బహుశా పళని వేలు పనేనని తీర్మానించుకుని ముత్తు, అతని అనుచరులూ భయంకర ఆయుధాలతో నేరుగ పళని వేలింటికి వెళ్ళి మిమ్మల్ని చంపి పాతర వేస్తాం చూస్కో అన్నారట. దాంతో పళని వేల భార్య ఆత్తాయి తన భర్తనో గదిలో పెట్టి తాళంవేసి తానో గదిలో లోపలగ తలుపువేసుకుందట వాళ్ళు తాళం పగలేసి పళనివేలుని బయటకు యీడ్చి, గునపాలతో పొడిచి చంపి, ఆత్తాయినీ, తలుపు విరక్కొట్టి బయటకు యీడ్చితెచ్చి, అంతతో ఆవేశం ఆగకవారి కూతురు 13 ఏళ్ల ఈశ్వరి, 10 ఏళ్ళ శ్రీనివాసన్ లమీద విజృంభిస్తే వారిద్దరూ పారిపోయారట. వీళ్ళు వారినివెంబడించి శ్రీనివాసన్ని పట్టుకుని ముక్కలు ముక్కలుగా నడిరోడ్డుమీద ఊరు వూరంతా చూస్తూండగా నరికి పోగులుపోసి చక్కా పోయారట.

## రష్యాకు పాదరక్షల ఎగుమతి

భారతదేశం నుంచి రెండుకోట్ల అరవైలక్షల కిమ్మత్తు చేసే ఐదు లక్షల చెప్పులు, బూట్లు రష్యాకొనుక్కోడానికి ఒప్పుకుందట. ●



## కొత్త కెరటం

మీ (మా) 3—2—78 పత్రిక చాలా బాగుంది. కొత్తకెరటం కథ మాకు చాలా నచ్చింది. దయచేసి ఈ కథ రచయిత జి. నరసింహమూర్తిగారికి మా ధన్యవాదాలు తెలపండి. రాగమాలిక సీరియల్ మమ్ములనెంతో ఆకర్షించింది. జి. వి. జి. గారి పేజీ పత్రికకే ఒక ప్రత్యేక ఆకర్షణ 3—2—78 పత్రికపై ముఖచిత్రం జయలక్ష్మి మాకేమి నచ్చలేదు.

సోమయాజుల శర్మ, కృష్ణ, సూర్యం, (కోరాపుట్, ఒరిస్సా)

### గమనిక

వ్యక్తుల పేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరుపైన లేదా కార్డుపైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ — 520 003 అన్న చిరునామాకి పంపండి. —సం.



# ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

### కథలు

3—2—1978 పత్రికలోని కథలు కొత్త కెరటం (జి. నరసింహమూర్తి) యాదృచ్ఛికం (రాఘవరావు వేదగిరి) చాలా బాగున్నాయి. రాగమాలిక సీరియల్ హుషారుగా సాగుతోంది. ఈ వారం పత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంద నడంలో సందేహంలేదు.

కొమాండూరి రేఖా రాణి (హనుమకొండ)

*　　*　　*

3—2—78 నాటి సచిత్ర వార పత్రికలోని కొత్త కెరటం కథ చాలా బావుంది. యువ వనితలకు మార్గదర్శం ఈ కథ. రచయితగారికి ధన్యవాదాలు రాగమాలిక సీరియల్ ఎంతో నచ్చింది మాకు.

విజయా చౌదరి, కస్తూరి, [నాగేంద్రపురం]

*　　*　　*

చక్కని విమర్శనాత్మకమయిన దృష్టితో వ్రాయవలసివస్తే అంతరాలు, ఇదేమిలోకం సమాంతర రేఖలు కథలు చాల బాగున్నాయ్ అని, తప్పక చెప్పవచ్చును. త్యాగగుణం వమలు కలేని భారతి, స్వార్థం అంటే ఏమిటో తెలియని లక్ష్మి ఈ రెండు పాత్రలూ సమాంతర రేఖ లయితే వాటిని కలపగలిగింది ఒక్కటే విధి వంచిత అయిన భారతి, మధుకూడ త్యాగమయి అయిన వాడుగా కథలో చిత్రింపబడితే రాధ కేవలం రాగ సుధగా, అనురాగవల్లరిగా మిగిలి పోయి ఉండేది ఆ కథలో కవిత ఈవారం ఒక్కటే ప్రచురింపబడినా అది హృదయంగల వారిని స్పందింపచేయగలదు.

ఏ. పూర్ణచంద్రరావు— (విశాఖపట్నం)

### విశ్వసాహితి పోటీ

విశ్వసాహితి సంస్థ ఉగాది కథల పోటీ నిర్వహిస్తున్నది. ఉత్తమ కథలకు వరుసగా 200, 100, 50 — బహుమతులు ఇస్తా. ఈ కథలు స్వీకరించుటకు ఆఖరుతేదీ 10—3—1978 కథలు పది అరటావులు మించి ఉండ దు. విశ్వసాహితి, 208, స్వ్యాబోయి, గూడ, సికింద్రాబాదు—3 చిరునామాకు వ్రాయవచ్చు.

ఏ. సాంబశివరావు (సికింద్రాబాదు)

*　　*　　*

3—2—78 నాడు వెలువడిన మీ మా సచిత్ర వారపత్రికలో కథలు నాకు చాలా ఆకట్టుకున్నాయి. ముఖ్యంగా కొత్త కెరటం కథలోని సరోజపాత్ర నాకు చాలా నచ్చింది. ఆ కథలోని సరోజపాత్ర చాలా విచిత్రమైన మలుపులు తిరిగాయి. తన కుటుంబ సమస్యలు అవగాహన చేసుకొని తన తల్లిదండ్రులు, అన్నయ్య ఎన్ని అన్నా, చివరివరకు వోర్పువహించిన సరోజ ఫలితం సాధిస్తుంది. తన అన్నయ్యకు కనువిప్పు కలిగించిన సరోజ పాత్రను తన స్వ రచనతో వ్రాసిన శ్రీ జి. నరసింహమూర్తికి మీ మా పత్రిక ద్వారా నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఇలాంటి కథలు మునుముందు ప్రచురిస్తారని ఆశిస్తాను.

సి. హెచ్. రామారావు [ గజపతి నగరం ]

### వ్యాస శీర్షికల—మాల

జనవరి 27, 1978 వ తేది, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో, సినిమా చూసిన శ్రీనివాస్‌గారు, కళ్యాణి, సరస్వతుల దగ్గర వంటలు నేర్చుకొని, భావరాజుగారి మానయాజులం మతి పట్టుకోపడి, కె.రా. గారి ప్రశ్నావళిలో బులుసు గారి ధర్మపథంనుంచి ఒక ప్రశ్నవేసి, ఆ అందిన జవాబుని తి. రా. గారి హైదరాబాద్ నోట్ బుక్‌లో వ్రాసుకొని, మహేశ్‌గారి వార ఫలం నిజమయితే, విరాణిగారి సహాయంతో బైస్కోపుతో బాతాఖానీ చేస్తానని సరదాపడి, పాలక్షుని డైరీ నుండి జివిజి పేజీలోని ఉమెన్స్‌గారి లోకం పోకడలో తాజాకాలం చదివేక ! అవీ—ఇవీ—అన్నీ ఎందుకు అని అనుకొని పత్రికకు ఉత్తరాలు వ్రాయడం మొదలెట్టారు.

అనామా (ఖర్గపూర్)

### ఆనందలడ్డు

కావలసిన వస్తువులు :— పచ్చి సెనగ పప్పు —పావు శేరు మెత్తగా దంచిన పంచదార— పావు శేరు నెయ్యి 300 గ్రా ఏలక్కాయలు - 10 జీడిపప్పు, కిస్‌మిస్— తగినంత.

తయారుచేయు విధానం:— శనగ పప్పును రాత్రి నాన పెట్టుకొని ప్రొద్దున్న వడ వేసి మెత్తగాకాకుండా, నీళ్ళు వేయకుండా రుబ్బవలెను. పొయ్యిమీద కళాయి పెట్టి మొత్తం నెయ్యి పోయాలి. నెయ్యి కాగిన తరువాత ఈ ముద్దను అందులో వేసి, సన్నటి సెగమీద వేయించవలెను. కొంతసేపటికి ఘుమఘుమ వాసన వస్తుంది. అప్పుడు కళాయి దించాలి. చల్లారిన తరువాత గోరు వెచ్చగాఉన్నప్పుడు పంచదార పొడి యాలక్కాయపొడి, జీడిపప్పు కిస్‌మిస్ వేసి అంతా కలపవలెను. తరువాత కావల్సినంత సైజులో ఉండలు కట్టవలెను.

— మాధవపెద్ది మీనాక్షి.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor, S. Radhakrishna**

# ఓట్లకోసం పాట్లు

మీరేం చేసినా సరే...
నా ఓటు మాత్రం మీకు
వెయ్యను—
చూశావామ్మా! తండ్రికి తగ్గ కొడుకు
అని పించుకున్నాను. నాన్నగార్ని పార్టీలోంచి
బహిష్కరించారు కదా! నన్ను మా
స్కూల్లోంచి బహిష్కరించారు!
ఓటుకు
వంద ఇమ్మన్నా
కదా... మరి
వోట్లు అన్నీ
ఏమయ్యాయి?
మీ ఎగస్పార్టీ డబ్బంద
పిచ్చించండి... అయినా
వోట్లు వారికే పడ
లేదండీ... దానికి
గాజులు... కుంకుమ
పంచిన సుబ్బమ్మగారు
పట్టాయించి వోట్లన్నీ!
మీ మాయ మాటలకి మోసపోటాన్కి -నేను
బయటి ప్రజల్లాంటి పిచ్చిదాన్ననుకున్నారా-
ఆ పప్పులు మన దగ్గర ఉడకవు - నాకు
పట్టు చీర పెస్తేనే
నా ఓటు మీకు-
అర్థమైందా.....!!

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

